



# ధనేకుల వెంకటేశ్వరరావు

# సమగ్ర రచనా సంపుటి









# ధనేకుల

# వెంకటేశ్వరరావు

## సమగ్రరచనా సంపుటి



**కవిసభ**

ప్రశాంతి నిలయము లక్ష్మీపురము, **3**వ లైను

గుంటూరు **– 522007**

ఫోన్ నెం: **0863-2243084**

ఉచిత దిగుమతి కొరకు

**Kingie.com**

**Teluguthejam.com**

## విషయ సూచిక


| | | | |
|---|---|---|---|
| కవి జీవిక | : 03 | గాయకుడు | : 40 |
| అవతారిక | : 04 | కళామౌని | : 41 |
| కరుణశ్రీ | : 06 | కవి సమ్రాట్టు | : 44 |
| ఆత్మ వేదన | : 07 | నవయుగ కవిచక్రవర్తి | : 45 |
| స్ఫూర్తిశ్రీ | : 07 | నేను వ్రాసిన లేఖ | : 46 |
| గుండె గోల | : 08 | నాకు వచ్చిన లేఖ | : 47 |
| విషయ వాసనలు | : 09 | తెనుగులెంక పుట్టుపండువు | : 48 |
| విపరీత ఘట్టములు | : 10 | మా ఊరి రెండు కొండలు | :49 |
| సాంత్వనము | : 11 | ముదిమి | :55 |
| కవితాత్మ | : 12 | ఆషాకుమారి | :56 |
| బాల్య భూమిక | : 14 | గీతాకుమారి | :57 |
| యౌవన జీవిక | : 16 | నాన్న | :59 |
| విరహ పూర్ణిమ | : 17 | అన్న | :61 |
| పిచ్చి పూవు | : 18 | చిన్నాన్న | :62 |
| సీతాకోకచిలుక | : 19 | అశ్రుమాల | :63 |
| మశకోపాఖ్యానము | : 24 | ఆత్మ నివేదన | :72 |
| రోసగాడు | : 25 | గుంటూరు (గేయ కవిత) | :73 |
| దోసగాడు | : 26 | ఆకుబూర (గేయకవిత) | :94 |
| పులి – పాము | : 27 | 1. పెద్దమ్రాను | :94 |
| సరస్సు | : 28 | 2. చెట్టు చుట్టు | :96 |
| జాలి పాట | : 30 | 3. ఆకుబూర | :101 |
| విస్మరింప రాని విందు | : 31 | 4. గాలివాన | :105 |
| పునర్జన్మ | : 34 | తత్త్వచింతన | :108 |
| పుడమి తల్లి | : 35 | మిత్రనేత్రాశ్రుమాల | :109 |
| సాగర స్వామి | : 36 | ప్రార్థన | :112 |
| గాడ్పు సామి | : 37 | నెమలి ఈడు (గేయ కవిత) | :116 |
| మహాత్ముడు | : 38 | సీతాకోకచిలుక | :123 |
| నేను | : 39 | | |

# కవి జీవిక

ధనేకుల వెంకటేశ్వరరావు



ప్రశాంతి నిలయుడు
శ్రీ శ్రీ శ్రీ సత్యసాయీశ్వరునకు
ఆనందప్రాప్తికై, ఆత్మసంతృప్తికై
నేనల్లుకొన్న వన్నెల కైతలివి; కాన –
ఆనందరూపున, కాత్మబాంధవునకే
వీని నంకితము గావింతు కైమోడ్పుతో

## అవతారిక

ఎంతగా మారిపోయినది నా బ్రతుకు!
చింతలన్నియు చెల్లచెదరాయె తుదకు!
వెలుగునీడలు వెనువెంట నెన్నెన్ని
తొలగిపోయెనొ నా బ్రతుకుబాటమీద!
ఇన్నిన్ని జీవనస్మృతులు స్పందించి
నన్నొక కవిగా నొనర్చినవేమొ?
మా తాళశైలగ్రామగిరుల నెక్కి
చేతముప్పొంగ వ్రాసితి కైతలెన్నొ
పలనాటి దృశ్యకావ్యము వెలయించి
'అలరాజు' కవిగ విఖ్యాతినందితిని!
తరువాత - నా జీవితమొక క్రొంగొత్త
తెరువు, నానందపు చెరువు నందినది.
సత్యసాయీశుడు, సద్గురుదేవు
డత్యంతకృప తోడ ఆ దారిజూపె!
ప్రతిపదార్థము రసద్రష్టయౌ కవన
ప్రతికి చైతన్యసారాంశమ్ము నొసగు!
సామాన్యసన్నివేశమ్మున కవి అ
సామాన్యజీవిత సత్యమ్ము నరయు!
జడదశ నుండి ఆ చైతన్యదిశకు
అడుగిడు సాహితీయాత్ర నా బ్రతుకు!
కవితాత్మ! నాలోని కవితాత్మ! నేడు
నవజీవన ప్రాంగణమున నిల్పినది!

ఈ కవిజీవిక యెంత విచిత్ర
మో కాని, ఆనందమును మానదేల?
ఎన్ని భావనలు! మరెన్ని కల్పనలు!
అన్నియు ఆనందమై పోవుటేల?
అది భీకరవిషాదమైనను గాని,
హృదికి బ్రహ్మానందమే యగుటేల?
అనుభూతు లెన్నెన్ని! అవి యెట్లు వచ్చి
నను గాని, సర్వమానందమౌటేల?
నవ్వులో, ఏడ్పులో - నాడు డెందంపు
పువ్వునం దానందపు మరందమేల?
ఏ రసవాహిని యేని ఆనంద
వారాశి లోనికే ప్రవహించుటేల?
అందుకే పెద్దలు - ఆనంద మాత్మ
యందుద్భవించు సహజవిద్య యనిరొ?
నా కవితాత్మకానందమే నేటి
యీ కవిజీవికా కృతిని దాల్చినది!
కరుణతో, స్ఫూర్తితో, కవితాక్షరముల
గఱపిరిర్వురు దేశికా గ్రణుల్ నాకు!
స్మరియింపగా నెంతు మనసార వారి
నిరువుర నిప్పుడీ కృత్యాది యందు. *

## కరుణశ్రీ




శ్రీకార మెవ్వాని లేఖినీనామాంత
ముననిల్చి కొంగ్రైతపూలు పూచె!
కారుణ్య మెవ్వాని కమనీయకవితా సు
ధాపగా చైతన్యరూపమూనె!
లాలిత్యమెవ్వాని రమణీయసాహితీ
పదరాశిగా మారి వాసికెక్కె!
మాధుర్యమెవ్వాని మాటలో, మనసులో,
మనుగడలో, లీనమై తనర్చె!
ఎవని రసవత్కృతుల ఆంధ్రు లెల్ల వేళ
లందు చదువుచు పాడుచునుందు రతని
పాపయాఖ్యుని, జంధ్యాల వంశభవుని,
మద్గురువరుని గొల్తు నమస్సుమాలు!

## ఆత్మ వేదన

ఏ నాటికో నా హృదయ వనవాటిలో
పూలు పూచీ, ఫలములు కాచీ,
మోడుమ్రాకులు కూడుకొనుట:
ఏ వాసరమునకో నా హృదయ కాసారములో
జలములు నిలిచీ, జలజములు మొలచీ,
ఎండిన ప్రతులే నిండుకొనుట!
ఏ రోజునకో నా హృదయ రోదసిలో -
మింటి విరులు మెఱసీ, మేలి వెన్నెల విరిసీ,
కాఱు కజ్జలము జారుకొనుట!
ఏ దినమునకో నా హృదయ దేవాలయములో –
పూజలు జరిగీ, పుణ్యము పెరిగీ,
పాప భారము కరగిపోవుట!
ఏ కాలమునకో నా హృదయ లోకములో –
అరుణ కాంతులు వెలిగీ, కరుణ శాంతియు కలిగీ,
కలహ భావము తొలగిపోవుట!

## స్ఫూర్తిశ్రీ

ఆకృతిన్ వామనుండు హృదయావిష్కృతిన్ త్రివిక్రముడు,
వ్యాకరణాలంక్రియాది బహుశాస్త్రధను డెవ్వడట్టి
కాకవిభీకరున్, నవ్యకవిలోక శ్రీకరున్, స్ఫూర్తి
శ్రీకవిభాస్కరున్, గురువరేణ్యున్ నుతింతు నతింతు.

## గుండె గోల

హృదయమా! ఆవేశ మేటికే నీకు?
చెదరిపోయెద వీవె చింతల లోన!

ఏ రసార్ద్ర లోకమునకో యీవు నన్ను
లాగికొని పోదువే మహా వేగమూని;
అపుడు నా జీవితార్థమ్ము నరయనై తి
ఇన్ని గుంటలు మెట్టలు నున్న వనుచు!

మున్ను నీ చేతి బొంగరమువలె నేను
గ్రుడ్డిగా సంచరించితి, రొష్టు పడితి!
ఈత డొక పిచ్చి వాడను హీన కీర్తి
దెచ్చుకొంటి, నాలో నేను నొచ్చుకొంటి!

ఎండమావుల గని పోవు ఇఱ్ఱి వోలె
వెఱ్ఱిగా నప్పుడెపుడొ పర్విత్తినాడ!
బ్రతుకుదెర్వున నిక్క మరయుచు, ఆగి
యాగి పోవలెనని నేటి కరసి నాడ!

హృదయమా! ఎఱుగ వీవీ చిక్కుదారు
లది యిది యేమని యడిగెద విప్పుడు! *

## విషయ వాసనలు



చిననాడు నేను, నా చెలికాండ్రు నాడుచుం
డిన కందుకమ్ము పడెన్ నూతి లోన దా
నిని దీయు గొట్టు పనికి జొచ్చి నేనును
మునిగితి ఆ కూపమున కర్మవశమున!

ఉక్కిరి బిక్కిరి చేసి, ఊపిరి దీయుచున్నట్టి
చిక్కు చీకటి నీటిలోని జిక్కులు వడుచుంటి నేను;
అక్కడ నంత మూగిన జనావళి నున్న పుణ్యాత్ము
డొక్కడు నన్నుద్ధరించె నొడ్డున కా నూతి నుండి!

బావి లోన బడిన బంతి వంటి విషయ
వాసనల కెన్నిటికొ తరువాతి జీవి
తమున జిక్కి, అజ్ఞానకూపమున బెక్కు
మార్లు మున్కలు వేసితి మందమతిని!

## విపరీత ఘట్టములు





కొందఱము బాలురము గుమి గూడి యాడు
కొనుచు, మా ఊరి దేవళమ్మునకు జేరి
నాము: మా లో నొకడు వాహనాల చెంత
కరిగి, యొక బొమ్మ కేలూడ బెఱికె! నేను
కొంత మందలించితి వాని కొంటె పనికి!

అతని చేనుండి ఆ దారుహస్తమేను
లాగికొని, అట నున్న ఆ ప్రతిమకు దగి
లించు నంతలో - కాకతాళీయ రీతి
నటకు పూజారి వచ్చి, నన్నరసి, ఆగ్ర
హించి, నా మొర వినక దండించె నన్ను!

ఇట్టివే కొన్ని విపరీత ఘట్టములు త
టస్థ పడి బిట్టుగా న న్నవస్థపెట్టె
జీవితమున నెంతగ మంచిసేయబోవ
అంతగా చెడుగేతెంచు నప్పుడపుడు!

## సాంత్వనము

ఈ కుటిల సంకుచిత ఘోర లోక జీవి
తమున వ్యాకులపడి, శోకతప్త చిత్త
భారమూని, పోయితి వనవాటి కేను
ఎవ్వరో నన్నటకు నడిపించినట్లు!

చెమ్మగిల్లిన కనులతో, చిన్నవోయి
న వదనముతో గరికపాన్పున బడియుంటి!
నాది నిదురయో, మెలకువో నాకె తెలియ
రాని యొక విచిత్రావస్థ లోన నుంటి!

వివిధ సుమగంధ మయ మందపవన రూప
మును వహించి వచ్చిన దివ్యమూర్తి యెవరొ?
తన మృదుల కరాంగుళుల నా కనులు దుడిచి,
చెక్కిలి నిమిరి బుజ్జగించినది నన్ను!

తన ప్రగాఢ పరిష్వంగమున మహాత్మ
రాలు నన్నప్పు డునిచె నిద్రా సవిత్రి!
హృదయమా! అప్పు డీ వెట కేగినావొ ?
ఏ సమున్నత సీమకు ఏగినావొ ?

జరిగి పోయిన దేదియు తిరిగి రాదు,
జరుగు చుండిన దేదియు స్థిరము కాదు,
జరుగబోవున దేదియో యెఱుగ రాదు,
హృదయమా! వ్యర్థ చింతన మేల నీకు?

## కవితాత్మ



ఓహో! మహాకవీ! ఉజ్జ్వల ప్రోన్న
తో హాయన విహారి! ఉత్తేజ కారి!
ఓ! కవితా విభవోన్మత్త హృదయ!
నీ కిదే పల్కెద నేను స్వాగతము -
నరులలో ప్రత్యేక నరుడవు నీవు,
తర తరమ్ముల విశ్వ తాత్త్విక ఖనివి:
ఏ నాటి వాడవో, యీ నాడు నుంటి
వా నాటి నుండి మహా ప్రవక్త వలె!
అణువు మొదలుగ బ్రహ్మాండమ్ము దాక
అణిమాది సిద్ధుల ఆక్రమించెదవు!
ఎన్ని శోధింతువు! ఎన్ని కాగలవు!
అన్నియు సాధింతు వఖిల మయ్యెదవు!
నీవు నా యెడ కరుణించిన చాలు –
నీవు నాలో నింత నిల్చిన చాలు -
దివ్య భాగీరథీ తీవ్రవేగాన
నవ్య భవ్య కవిత నాలో రహించు!
పరవళ్ళు ద్రొక్కు నవకవన గంగ
యురవడిలో విశ్వ ముగ్రూతలూగు!
నేనిదే నేడు పూనితి అతిలోక
మానసానంద సంపాదనమ్మునకు -

మును జగన్మోహనముగ నీవు పోయి
న నవరస పథమ్మున గమింతు నేను!
నీతి దుర్నీతుల నిర్ణయించుటకు
హేతువాద జ్యోతి నెత్తెద నేను!
వాడిన బ్రతుకులు పచ్చబడుటకు
పాడుదు ఆమని వంటి కైతలను!
అంధకూపమ్ము లందల్లాడు బడుగు
లందఱ కిటులె సాయమొనర్తు నేను!
రమ్ము! మహా కవీంద్రా! స్వాగత మిదె
రమ్ము! నా లోన బరవశించి పొమ్ము!
రమ్ము! నా లోన బరవశించి పొమ్ము!
సమ్మోద కవితారచన సేయనిమ్ము!
భవదీయమైన ఆవాహన వలన,
భవదవగాహన వలన ధన్యుడను!
ధన్యుడ, పుణ్యుడ, ధాత్రిపై నేను
గణ్యుడ నీ యమోఘ స్మృతి వలన! *

## బాల్య భూమిక



చెలికాండ్రతో జేరి చీకుచింతలు లేక
ఆటలాడుకొనిన ఆ దినాలు -
దొరకిన చిరుతిండ్ల తోడనే సంతృప్తి
నందుచు ఎగిరిన ఆ దినాలు –
బ్రతుకుతెర్వును గూర్చి బరువు బాధ్యత లేవొ
అరయక తిరిగిన ఆ దినాలు –
మనసు లోపల నెట్టి మాయమర్మము లేని
అమృతకల్పములైన ఆ దినాలు -

వట్టి బూటకమ్మను బోలు పరువు కొఱకు,
చెట్టలకు నెల్ల మూలమౌ సిరుల కొఱకు,
నట్టుపడక సాగిన ఆ దినాలు - గడచె
పసరు తళ్కుల మెఱయించు బాల్యమందె

ఆకలియు, నిద్రయును గాక - ఆడుకొనెడు
తలపులును గాక - ఎట్టి బాధాకరంపు
భావములు, వాంఛలును ప్రాభవమ్ము గనని
ఆ దినాలు గతించె బాల్యమ్మునందె!

ఆల్పభావవీథి, స్వల్ప మనోరథ
గతిగ బాల్యమెల్ల గడచిపోవ -
చేదు, తీపియు గలసిన కామప్రేమల
ఆమని వలె వచ్చె యౌవనమ్ము!

జీవితోదయవేళలో చిన్ననాడె
చిత్రకళ నిజముగ వరించినది నన్ను!
చిత్తమున కొనసాగు విచిత్ర భావ
లతలె చిత్రకళా సుమాకృతుల దాల్చె!

నల్లపలక నిండ తెల్లగీతల లోన -
తెల్లపుటలు నిండ నల్లగీతల లోన -
అల్లిబిల్లి బొమ్మల నెన్నో -
కొల్లగొట్టినాడ ఉల్లమ్ము లెన్నెన్నో! *

## యౌవన జీవిక



జీవితమును గూర్చి చిత్రచిత్రములైన
భావమ్ము లుదయించు యౌవనమున -
నవ్వులో, చూపులో, నడకలో, నవనవ
హాసముల్ రవళించు యౌవనమున
ఆలోచనను మించి, ఆవేశమే మిన్న
యై యప్పళించును యౌవనమున
కోర్కెలు తీవ్రమై కొంటెగా గల్పించు
అతిసాహసంబును యౌవనమున -

లోవెలుంగు గానక, పైమెఱుంగు జూచి
అడ్డమైన వెతల నొడ్డు యౌవనమ్ము!
జీవితానంద మాధురీశ్రీల కెల్ల
తావలము వోలె భ్రమ పెట్టు యౌవనమ్ము!

పాలపొంగు వంటి పడుచు ప్రాయమందు
మింటి కెగయు గాలిపటము వంటి మాన
సమ్ము నాత్మనిగ్రహసూత్ర సంధికమ్ము
జేసికొన్నదే యోగము జీవితమున!

మలినభావమ్ము లెసరేగి మనసునెల్ల
కలవరము పెట్టు యౌవనకాలమందె
నిర్మలము, నిశ్చలము నైన నెమ్మనమ్ము
జీవితమున నిల్పును నిత్యయౌవనమును!

ఆటగా బాల్యమ్ము నందున్న బ్రతుకు
పాటగా మారు యౌవనకాలమందు!
జీవితమొక రసచిన్మయజ్యోతి!
భావబంధురమైన బహువర్ణగీతి!

# విరహ పూర్ణిమ



ఆ మబ్బులను వీడె నదె చందమామ!
ఈ ముసుగెందుకే యిక నీకు భామ?
రేయెండకే తాళలేవేమొ నీవు!
ప్రాయంపు తళుకెల్ల వసివాడునేమొ!
చేరువ నుండియు, చెంతకు రాని
కారణమేదియో కలికీ: తెలుపవే?
చూపునే క్రొవ్వాడి తూపుగా జేసి,
నా పైకి రువ్వవే నా కదే చాలు:
హృది కన్న కోమల మేదియు లేదు:
హృది కన్న కర్కశమేదియు లేదు.
ఏ భావ మెంతువో ఇంతిరో నీవు -
ఆ భావనాకృతి నందునే యెడద!
బాధయు మాధురీ భరితమే యనెడు
బోధకుల పలుకులు బొంకులే యనెద!
విరహవేదన గూడ వేడ్కగా గొనుట
కొరవితో తల గోకికొనుటాయె తుదకు
వెన్నెల వచ్చెనే వేవేగ పోవు
చున్నదే జాబిలి! ఓ చెలీ! వినవె
ఇంత తీయని రేయి యిటు జారునేని
చింతించుకొందుము చేదుగా మనమె! *

## పిచ్చి పూవు



"నా రూపున కే లోపము?
కారుణ్యము సూపడు, నను కౌగిలి సేయం
డౌరా: భృంగ" డనుచు నీ
వూరకవలపోతువేల ఉమ్మెతపూవా?

''చల్లదనమ్మును బోలిన
తెల్లదనపు చాయ నొప్పు దేహము గల న
న్నొల్లక తొలగెడు ఆతని
ఉల్లము తీరే'' మనెదవు ఉమ్మెతపూవా!

తుమ్మెద గాడొకే సుమముతో విహరింపడు, గాలివాడు, దే
హమ్మును బోవనిచ్చు నెవరైన నదే పనిగా అనేక పు
ష్పమ్ముల పైకి! వాని కొక పద్ధతి లే దటువంటి చంచలున్
నమ్మెద వేటికే? బ్రతుకు నవ్వుల పాలగు నమ్మ ఉమ్మెతా!

''వాని గొన మిట్టిదైనను
గానీ, యిటు వాడు రాని కారణమేమో?
నేను పనికి రానో ? మది
నూన డిదేలా?'' యనెదవె ఉమ్మెతపూవా!

నిక్కము చెప్పెద వినవే
చక్కనిదాన వలపైన, సరసత యైనన్,
మెక్కింపగ మధువైనను,
ఒక్కటియును నీకు లేదె ఉమ్మెత పూవా! *

## సీతాకోకచిలుక

ఏ రసజ్యోతి వెల్గింప వచ్చితివో?
ధారుణి కీవు సీతాకోకచిల్క!
తరలి వచ్చిన దేవతా సుమనస్సు
ధర నీవె కదవె సీతాకోకచిల్క!
అల్లన జిగిరెక్క లల్లార్చుకొనుచు
ఎల్లతోటల విహరింతువే నీవు!
కనిపించు పువు పువ్వు కడకేగి, యేగి,
మనసార కడు పరామర్శింతువేదొ?
దేవుని జూపు ఏ దివ్యమంత్రమునొ
పూవుల చెవులందు బోధింతువేమొ?
ఇట లేని యే మ్రాని కీ సుప్రసూన
మెటుల పూచిన దనిపింతువే నీవు!
వాయువల్లికి పలువన్నెల పువ్వు,
ఆయువు గల పువ్వువై నావె నీవు?
పూలపల్లకి వోలె, పూబొమ్మ లున్న
గాలిపటము వోలె గమియింతువీవు!
ఏదియో వెదకుచుందు వేవేళ గాని
కుదురుగా నొకచోట గూర్చుండ వీవు!
నీవట్లు నిరతమన్వేషించు తత్త్వ
జీవికార్థ మ్మంతు చిక్కునా నీకు?

నీవు కన్పడునంతనే స్వాంతమెల్ల
భావనా సౌరభవంతమౌ నాకు !
నీవుండు నందాక నిను జూచి, చూచి,
నీవేగ, నాలోనె నిను జూతు నేను!
ఎవరవో నీవు, నీవెవరవో కాని -
వివిధార్థ ప్రశ్నల వెలయింతు నేను!
ఏ చిత్రకారుడు సృజియించుకొన్న
ఏ చిన్మయానందవృత్తాంత మీవొ!
ఏ రమ్యగాయనీ మృదుగీతి లోని
ఏ రాగమంజరి కీవు రూపమవొ?
ప్రేయసీ ప్రియు లెవ్వరి కొఱకెవ్వారొ
వ్రాయగా బోవు వలపుటు త్తరమవొ?
ముంగిళ్ళలో బుట్టి మురిపించు రంగు
రంగుల సంక్రాంతి రంగవల్లికవొ?
దీపావళి వేళ తిమిరాళి ద్రోలి
దీపిల్లు బహువర్ణ దీపవల్లరివొ?
ఈ రూపుగా మారి యేగు ఏ పెండ్లి
వారింటి ఐరేని బానవే నీవు?
పువుటిండ్ల పేరంటమున కరుదెంచి
భువి నున్న యే వేల్పు ముత్తైదు వీవొ?
తళుకుబెళ్కుల చీరె దాలిచి, నృత్య
కళ నూగు ఏ ఆటకత్తెవే నీవు?

దేవేంద్రసభ నుండి దిగివచ్చి, పుడమి
లో విహరించు తిలోత్తమ వీవొ?
అక్కడి నిత్యకళ్యాణమ్ము గూర్చి
చుక్క గుమ్మలు పంపు శుభలేఖ వీవొ?
స్త్రీలలో, పూలలో ప్రేమనే చూడ
జాలిన ఏ సరసాత్మవో నీవు?
తను దగ్ధమైనను, తన ధాటి తప్ప
దను మన్మథుని పువ్వుటమ్ముల గమివొ?
జాలిగుండె గల ఏ స్వామి కే భక్తు
రాలొనరించు పుష్పాంజలి వీవొ?
ఋతుకాంతు చెంత ప్రకృతికాంత పొందు
స్మృతికాంతులను జూపు చిత్రదర్శినివొ?
సృష్టికారుడె ధరాశృంగారవతికి
ఇష్టసిద్ధిగా ప్రసాదించిన నగవొ!
ఏ రసాయనక్రియ నిట్లు మారితివొ!
ఏ రాజయోగాన నింత మీరితివొ?
దుబ్బుగొంగళి మేని తోడ చిన్నపుడు
ఎబ్బెరికంపుటాకృతి నుంటివీవు!
మునగకొమ్మను మొండిమొలతో మిగుల్చు
ఘనవిద్య కానాడు కాణాచి వీవు!
గబ్బిచీకట్ల మెక్కగ నున్న నిన్ను
ఎబ్బె, ఛీ, యని యేవగించితి నేను

బొచ్చుబొమ్మవు, బొగ్గుపూసవు నంచు
పెచ్చుకూతల నిన్ను వెక్కిరించితిని
తలపునందెంతయో తంపి రగిల్చి
పలుమార్లు మాడ్చితి పాపము, నిన్ను!
సౌందర్య సంపద చాలలేదనుచు
కుందితివెంతయో
కుమిలిపోయితివి!



ఉన్న గొగ్గులబొంది నూడ్చి, అందాల
తిన్నని మేని నందికొన బూనితివి!
సత్కళాతపమొందు సాగించు కొఱకు
మృత్కులాయమ్ము నిర్మించితివి కద-



మరుగాలి చొరని ఆ మంటిగూటింట
పరమయోగసమాధి బట్టితివి కద-
నీ మనోరథమెల్ల నెరవేరు దాక
ఏమియు గొనక భీష్మించితివి కద-
రసపూర్ణ భావమంత్రము లేవియెవ్వి
కుసుమించి మేలు చేకూర్చినవొ కద-
అపుడెప్డొ ముడిమొగ్గ యట్లున్న నీవ
ఇపుడు విచ్చిన సుమాకృతి నుంటివి కద-
ప్రకృతిలో నున్న వర్ణాలెన్ని చేరి
కకు వచ్చి నిన్ను శృంగారించినవియొ?

వన్నెవన్నెలుగ నీ పక్షమ్ములౌట
కెన్నెన్ని సుమదళా లేతెంచినవియొ?
కన్నుల మిర్మిట్లు గఱపు నీవౌట
కెన్ని రంగుల మణు లేకమైనవియొ?
పగిలిన ఇంద్రచాపము నుండి ముక్క
లొౌగి కొన్ని నీరీతి నొనగూడినవియొ?
సంజమొయిళ్ళపై సాగు కిర్మీర
పుంజాలె రాలి నీవుగ మారినవియొ?



రంగురంగుల అంతరంగభావనలె
పొంగుచు రెక్కలై పొడగట్టినవియొ?
ఎంతెంత కృషి యొనరించు వారెల్ల
అంతంత ఫలితంబు నందుకోగలరె ?
గురుసాధన యొనర్చి, గొంగళి పురుగ!
సిరుల సీతాకోకచిల్క వైనావె !



నవ మోహనాకృతి ననలెత్తు నీకు
భువనమా తీపిసొంపులు పేరొసంగె!
ఒక మహాకవి సేయు ఊహల రమ్య
త కలదు నీకు సీతాకోకచిల్క! *

## మశకోపాఖ్యానము

నేను మేను మరచి శయనించి యుండ,
''అర్ధరాత్రి మద్దెల దరు వన్న పగిది –
ఎవడవోయి పాడెదవు నా చెవుల చెంత
వాయులీన మృదు మధురస్వరము లోన?



పగటిపూట ఏ మురికికాల్వ కడనో వి
హారమొనరింతువు కదా మహానుభావ?
ఇప్పుడిట్లు సింగారించి యేగుదెంచి,
ఏల లల్లాయి పద మాలపింతువోయి?

తనువుపై నొక సూది గ్రుచ్చు విధాన, ద్రావక బిందువున్
జినుకు , చర్మపుందెర జీల్చి నా రుధిరంబు నీ
తనివి తీరగ గ్రోలుచుందువు దానికిన్ బదులీ గతిన్
కనులనీటిని మాపు చందముగా నెదో కృతి పాడు ?

"చాలు, చాలు, ఇంక చల్లగా దయసేయు''
మనిన నాదు మనవి వినవు సుంత!
గాలిబంటు వచ్చి త్రోలువఱకొ, నేనె
నిన్ను నులుము వఱకొ నీవు చనవు!
నిన్ను దిట్టితి: నన్ను మన్నింపు మోయి!
నీ క్షుధానలశాంతికై నీ వెదో యొ
కింత నల్ల గ్రోలెద, వెంతయేని నెత్రు
ద్రావు యుద్ధార్థి కన్న ఉత్తముడ వీవు! *

## రోసగాడు



''మేలుకొనుమో! ప్రపంచమా! మేలుకొనుము!
తొలగె ఇరులెల్ల వచ్చె వేవెలుగు'' లనుచు –
గొంతు దాకాను పైకెత్తి కూతగూసి,
జ్ఞాని వోలె చెలామణి వైన పక్షి!

ఇలలోనం దెలవారుచో అది భవత్కృత్యంబుగా నెంచుచున్
నిలువన్నేరవు నేల మీద! ఎటనో నీ వింటి కొప్పెక్కి పెం
గులుకున్, టెక్కును జూపబోయెదవు నీకున్, వీపు కావించు ప
గ్గెలకున్  చేతులనెత్తి మ్రొక్కెదము; నీ గీరన్నిరోధింపుమా!

కాలవశంబునన్ పగటికాలము డాగు, తమస్సు మూగు; ఆ
కాలక్రమంబు నందె నిశికాలము జారు, అహస్సు చేరు గా
నీ లవలేశమేని యగునే భవదీయరవమ్ము చేత? నీ
కేల యకారణంబులగు యీగతి దర్పపు గూత లండజా ?

గొంతును జించుకో దగదు కుక్కుటమా! వలదీ బడాయి! నీ
వెంతటి జ్ఞానివో తెలిసె; ఎల్లరకున్ సకినాలు సెప్పి తా
నంతము నందదే కుడితి యందు మునింగిన బల్లి? రోసపుం
బంతములేల నీకు తులువా నిను నీవ వధించుకొందువా ?

నీ మనో బలహీనత, నీ వృథాక్రు
ధాభిమానముల్ తెలిసె గదా నరునకు!
నీ పయికి నిన్నె యుసిగొల్పి నిన్ను నీవ
కొట్టుకొని చావ జూచు ఈ కొంటెవాడు:

## దోసగాడు



మింటి మేడల మీద మా కంటి కీవు
కానరాక తిరుగు లోకకంటకుడవు!
నిశితదృష్టితో నటనుండి నీవు ధారు
ణిం గల యణువునైన బోనీయర!

తల్లికి దూరమై పరమ దైన్యమునం బడి తల్లడిల్లు చి
ట్టుల్లపు కోడిపిల్ల భవదుగ్రదురాక్రమణంబు లోన ని
ట్లల్లడి తల్లడింబడె, త దాయువులెల్ల క్షణంబు లోన నీ
వల్ల నశించు నెంతటి కృపారహితుండవొ శ్యేనరాజమా!

ఇంతకు నీవు నీ జఠరమే గతి నిండునొ యన్న దుష్పథం
బెంతువు కాని, చిత్తమున నించుక యైనను జాలి బూన వీ
వెంతటి ఘోరదుష్కృతుడ విట్టి నిరంకుశ మెన్ని నాళ్ళు? నీ
యంతట నీవ కూలు సమయంబొక నాటికి నైన రాదొకో ?

దాడిగా దవ్వుల నుండి ధాత్రిపై రివ్వున వ్రాలి,
కోడిని కోడినే తన్నుకొనిపోవ నుంకింతువోరి?
పీడాకరుడ: మాను మిట్టి బెడిదంపు పేరాస పనులు -
ఏడీ, దురాశయు డెవ్వ డీ యిల శాశ్వతుడయ్యె?

మది విచారించు కొలది తప్పిదము నీది
సుంతయును లేని విధమె తోచునిక నాకు!
ప్రకృతి నిదియె కాబోలు నీ బ్రదుకుదెరువు!
సృష్టిమర్మమ దెంత వై చిత్ర్య మయమొ ?



## పులి - పాము



సర్పమా! వ్యాఘ్రమా! స్పష్టములైన
దర్పణములు మీ హృదయములు రెండు!
మీరు తలెత్తి కనుడు వీరి వంక!
వీరికే మానవులనెడు పేరు కలదు!
మీరు సృష్ట్యాది నుండియు మారలేదు;
వీరు మాత్రము తామెంతొ మారినారు.
ప్రకృతిని గన్గొని, ప్రకృతి నూతగొని,
ప్రకృతిని గెల్చిన వారు మానవులు!
''పంచభూతాత్మకమగు ప్రపంచమందు
చావునొక్కటి గాక నే సర్వమును జ
యించినాడ! ఎన్నిటినో సాధించినాడ!''
నంచు ఎదురొమ్ము విరిచి దర్పించు నరుడు!
ఓరి, శార్దూలమా! ఓరి, భుజగమ!
మీరేమి సాధించి మెప్పులందెదరు?
బాస లేదు, భావము లేదు, బాగు లేదు,
లేశమేని సంస్కారమే లేదు మీకు!
అన్న తెలుగు నరులె మీకన్న ఘనులు!
చాటుమాటు లరసిన సంస్కార్లు వీరు!
వీరి మాటల వెన్క విషవిచారములు!
వీరి చూపుల వెన్క క్రూరభావములు! *

## సర్కస్సు

ఈ మధ్య మా ఊరి కేతెంచె నొక్క
ఆహ్లాదదాయకమైన సర్కస్సు -

పల్టీలు గొట్టుచు పసివాడొకండు
చిత్రాతి చిత్రముల్ సేయు నచ్చోట!

బరువు లెత్తెడు ఒక బలశాలి గడ్డ
పలుగును మెత్తగా వంచు నచ్చోట!

కంబముల్ రెంటికి గట్టగా బడ్డ
తీవెపై నిల్చి నాతి యొకతె నడచు!

ఎటనే మింట గల ఊయెలలెక్కి యూగు
చుఁ, గాలిలో దేలుచుఁ, దిర్గు నొకతె!

చక్రమ్ముపై నెక్కి సాగిపోవు రుచి
రాంగి యెన్నెన్నొ విన్యాసముల్ సేయు!

ఒకతె మొగ్గలను వేయును జ్వాలలూని;
ఒకడు రొమ్మున నిల్పు నుత్తుంగ కరిని!

కనుదోయి చిరుతలు గమ్ము, గుండె గరు
పొడుచు అద్భుతకృత్యముల జూతు మచట!

నడుమ నడుమ వచ్చి నవ్వించుచుంద్రు
పొట్టచెక్కలుగ బఫూను లిరువురు!

మృగరాజు నెత్తి పై మేక ముంగాళ్ళు!
నిల్పి దర్పముగ గాన్పించు నచ్చటనె!

పెదపులిమూకల వీపుల నెక్కి,
దూకి, చరించును దుప్పి యచ్చటనే

గుండుపై నిల్చి, యేన్గు తన నాలుగడు
గుల నుంచి దొర్లించుకొని పోవు నచట!

కోతి బైసికిలు ద్రొక్కుచు, గుఱ్ఱము పయి
స్వారి గావించుచు ప్రత్యక్ష మగును!

కుక్కలు, నక్కలు గుమిగూడి నృత్య
ముల సల్పుచుండును మోదము తోడ!

ఈ రీతి భిన్నప్రకృతు లొకేచోట
మానవునకు లొంగి మసలసాగినవి!

అట్టి అసాధ్యకృత్యమ్ములను తన
కు సాధ్యముల జేసికొన్నాడు నరుడు!

ఇన్నిన్ని మృగముల నెన్నెన్నొ గతుల
మచ్చిక యొనరించి మలపుకొన్నాడు!

తన హృదయాటవి దండెత్తు మెకము
లను మాత్రము వశపఱచుకొనలేదు! *

## జాలి పాట

పండువెన్నెలరా కారుణ్యము!
ఎండలో నీడరా కారుణ్యము!
విరులతావిరా కారుణ్యము!
తరుల ఈవిరా కారుణ్యము!
వెలుగు దారిరా కారుణ్యము!
కలహవైరిరా కారుణ్యము!
గానమాధుర్యమే కారుణ్యము!
మానవాదర్శమే కారుణ్యము!
చక్కని చల్లని కారుణ్యము!
చిక్కని తీయని అమృతము!
ఎక్కడనో కలదను స్వర్గము –
ఇక్కడనే యిలలో నిల్పుము!
గుండె తడియారనీయకుము!
బండపారి పోవనీయకుము!
దీనుల యెడ జాలిపడుము!
దానవతను విడనాడుము!
మానవతను నిలబెట్టుము;
పూని యిపుడే తలపెట్టుము!
కరుణామయ హృదయము -
పరమాత్మని నిలయము!

## విస్మరింప రాని విందు

అవి కళాశాల యందు విద్యార్థి
నగుచు నేనుండి నట్టి రోజులు
రెడ్డిరాజుల దొడ్డపాలన
చరితలందున చదివియుంటిని.
మండువేసవి మధ్య నొకనాడు
కొండవీడేగ కోర్కిబూనితి.
ప్రొద్దుపొడిచిన కొద్ది తడవుకు
నిద్దురను విడి సిద్ధమైతిని!
వట్టిపొట్టకు పచ్చిగంగయు
ముట్టుకొనకయె ముందుకురికితి!
జేబు నందున చిల్లిగవ్వయు
వేసికొనకయె వేగిరించితి!
పడుచుదనమున, ఉడుకు నెత్తుటి
దుడుకుదనమున దొందరించితి!
ఆకసమునకు దూకు తీరున్
సైకిలెక్కి, సాగిపోయితి!
లేచినప్పుడె లేడికి పయన
మన్న సామెత కర్థమైతిని!
అదిగో వచ్చెను, ఇదిగో వచ్చెను,
అదిగొ కొండవీడంచు నెంచితి!
కాలు సేతులు కరగిపోయెను!
తనువు చెమటను దడిసిపోయెను

నెత్తి మీదనే నిప్పులుమియుచు
ఇనుడు మింట మండించుచుండెను!
పట్టుబట్టుచు, తట్టువడుచు, నే
నెట్టకేలకు ఏగుదెంచితి!
నాటి నగరమె నామమాత్రమై
నేటి పల్లెగ నిల్చియున్నది!
ఊరి ముందుకు జేరితినొ, లేదొ,
బైసికిలు నుండి పడితి క్రిందను!
కనులు బైరులుక్రమ్మె, తల తిర్గె,
తనువు మొత్తము తల్లడిలసాగె!
'అయ్యొ! నాయనా! అట్లు పడిపోయి
తెవ్వరవు నీవు? ఎందుకిట్లాయె''-
అనుచు నొక పండుటవ్వ యెవ్వరొ
మొత్తుకొనుచు నాముందు కేతెంచె!
''లెమ్ము, నాయనా! లెమ్ము! ఇక్కడే
కొద్ది దవ్వున గుడిసె యున్నది.''
''లెమ్ము, అచటికి రమ్ము, పోదము
నీడలో నట నిదుర పోదువు -''
అనుచు, నన్ను ఆ యవ్వ కొంపోయె
తన కుటీరపు దరికి నప్పుడు!
బాగుగా చల్లబడిన దాక నే
నచట కున్కితి, అంత మేల్కొంటి!
''ఏమి నాయనా! ఎట్టులున్నది?''
అవ్వ అడిగెను ఆత్రముగ నన్ను

నోటి వెంట ఏ మాటయును రాక,
ఎదియు దోచక, ఏనటులే యుంటి!
కడుపులోని ఆకటి సెగలు రేగి,
కనులలో బాష్పకణములు తిరిగె!
అపుడు నా హృదయ మెఱిగిన అవ్వ
తొందరగా పోయి దుత్త కడిగెను!
ఇన్ని ఒక్క నీళ్ళే పడబోసి
కలిపె జొన్న సంకటిని చిక్కగా!
దోసిలిని బట్టు, దోసిలిని బట్టు
మనుచు వంచెను అవ్వ దుత్తను!
కడుపు నిండుగా గట్టుమని తేన్చు
దాక అంబలి డ్రావితిని నేను!
ఆమె యొసగిన దేమయిన నేమి?
నాటి కదె తోచె నా కమృతముగా!
ఆమె చూపిన ఆదరము నట్లు
ఆకొనిన నేను అందుకొంటిని!
తృప్తితోడ నా దెస నరయు జేజి
కిన్ని యేటికోళ్ళిచ్చుకొంటిని!
దానికి తరువాత బ్రతుకున నెన్ని
పెక్కు పెక్కులు విందులందితి!
కాని, అందు నొక్కటియు నాడు మా
అవ్వ పెట్టిన బువ్వ వలె లేవు!
ఏది విస్మరించినను నాటి
విందు మాత్రము విస్మరింపను! *

## పునర్జన్మ

జీవి కెన్నటికిని చావు లేనేలేదు,
ఉడుపు మార్చి యుడుపు దొడుగునట్లు
ఒడలు నూడ్చి క్రొత్తయొడలు దాల్చుననెడి
వేదవిదుల నుడుల వింటి నేను!

ఎన్ని జన్మలు మున్ను నేనె త్తినానొ?
ఇంక నేనెన్ని పుట్టువులెత్తగలనొ?
ఎఱుగజాలను గాని, నేనెన్నొ మార్లు
జన్మ లెత్తితి ఈ యొక్క జన్మమందె!
జీవితపథాన నిస్పృహ లావరింప,
దృష్టి ఆశాంతములకు సారించి వెదకి
గాఢతిమిరమ్ము మాత్రమే కాంచినపుడు -
పతనమయ్యు నెట్లో బ్రతికి బైటబడితి!

ఎపుడు బ్రదుకున గ్రుంగితి నపుడు నేను
బ్రదుకు కాని దాని కొఱకు వెదుకలేదు!
ప్రాత బ్రదుకునందే తల వంచలేదు;
క్రొత్త మనుగడ సృష్టించుకొంటి నేను!
ఇత్తెఱగున పునర్జన్మలెన్ని పూని
నాడనో లెక్కలేదు లేదు నాకు సుంత
ఈ ప్రపంచ నాటకశాల నిట్లనేక
పాత్రధారినై చల్లగా బ్రదుకగలను! *

## పుడమి తల్లి

లోకబాంధవుడై వెలుగు సూర్యభగవాను
నెల్లపుడు ప్రదక్షిణించు సాధ్వి!
బ్రహ్మాండ వీధి నిరంతరాత్మభ్రమణ
నృత్యముతో బయనించు రమణి!
కొన్నాళ్ళు వెన్నెల, కొన్నాళ్ళు చీకటి
రే ముసుంగులుగ ధరించు రాణి!
ఏ ఋతుకాలాన ఆ ఋతువేషంబు
దాల్చి కన్పించు అందాలరాశి!
అనుచు నిన్నెంత వర్ణించుకొనిన గాని
తనివి తీరదే నాకు ఓ! ధరణిమాత!
రత్నగర్భవు, క్షమవు, స్వర్ణ ఖని నీవు!
వందనములు! తల్లీ! నీకు వందనములు!

పుడమితల్లిరో! నీ పైన బుట్టి పెరిగి
జీవనక్రీడ చాలించు జీవులెల్ల
తిరిగి లేవని పెద్ద నిద్దురను మునిగి
వ్రాలెదరు నీదు గర్భతల్పమ్ము నందు!

ఎపుడు పుట్టినావో నీవు! ఈ యఖండ
భ్రమణకర్మయోగ మెపుడు పట్టినావొ!
ఈ పనికి నిన్నెవరు నియమించినారొ?
సరిగ వివరింపవే నాకు ధరణి మాత! *

## సాగర స్వామి



విశ్వమున కెల్ల వెన్నెల వెల్ల వేసి
మిన్ను మీద జాబిల్లి కొల్వున్న వేళ -
పట్ట శక్యము గాని సంబరము తోడ
సాగరుం దూగు కల్లోలరాగడోల!

ఈ యవని కెల్ల మసి పూసి, మాయసేసి,
కటికచీకటి యేల్బడి క్రమ్ము రేల -
మూర్ఛిలుచు, నిష్ఠురానిష్టఘోష పెట్టు
జలతరంగఘట్టనల ఈ సాగరుండె!

తొలుత క్షీరసాగరుడట తుట్టతుదకు
క్షారసాగరుడయ్యె నక్కట: అనాది
నుండి ఎన్ని కన్నీళ్ళను గుండెకెల్ల
బరువుగా నిముడ్చుకొనెనో పాప మితడు! *

## గాడ్పు సామి



ఆత్మభ్రమణనృత్యమ్ము ననంతశూన్య
వీధి నొనరించు భూదేవి వేగమందు -
గాడ్పుసామి వెలసి, నిరాకారుడయ్యు
నా హృది నొనర్చు బహుభావనామయంబు!
ఒంటికంబపు సుడిగాలి మంటిమేడ
అరసి ఆనంద పారవశ్యమున దేలి,
తీవ్ర ఝంఝా ప్రభంజన తీక్షహతికి
భయవిచారకులాఘాత పతితుడౌదు!
పూలవలపుల నెదలోన బులుముకొనియు,
ఏటి యిగమును తనమేన మాటుకొనియు,
ఈదు వెదురు జొంపములలో ఈల వేయు
మందమందానిలుని స్పర్శ లందుకొందు!
మబ్బుమందల దోలెడు మారుతుండు,
చంద్రనిప్పుల జిమ్ము గ్రీష్మానిలుండు,
ఎమ్ములను బట్టి కొరికెడు ఈదరాడు,
ఒక్కడే యిన్ని తెఱగుల నుండు వాడు!
ఇన్ని గొనముల గాలిగా డీతడయ్యు, -
ఋతువునారసి, దెసల మారి, ప్రసరించు
నియమగతుడీ జగత్ప్రాణనేత ధాత్రి
తిరుగునన్నాళ్ళు మరణంబు నెరుగడితడు! *

## మహాత్ముడు

లోకమంతయు నొకయిల్లు, ఆకసంబె
దాని కప్పు, ఇట వసించు మానవాళి
నిఖిలమొకటే కుటుంబమని తలపోయు
అతి విశాలహృదయుని మహాత్ముడనెద!

ఉన్నతోన్నత భావసంపన్నుడగుచు,
అతి నిరాడంబరంబైన బ్రతుకు గల్గి,
కష్టసుఖముల నొక తీరుగా భరించు
నట్టి సౌమ్యమానసుని మహాత్ముడనెద!

స్వార్థరాహిత్య పీఠము నధివసించి,
విమల కారుణ్యమణికిరీటము ధరించి,
శాంతికరవాలధారియై జాతిహృదయ
హర్మ్య విభుడైన వానిన్ మహాత్ముడనెద!

తనకు గల ఆశయములు, ఆదర్శములును
చెప్పుచుండుటలో గాక - చేసి చూప
గలిగియుంటలో నెంతయు ఘనతగన్న
ఆత్మనిగ్రహు నతని మహాత్ముడనెద!

ఎన్ని నామములున్నను ఈశ్వరుండు
మాత్రమొక్కడే యను ధర్మసూత్రమెఱిగి,
పరుని యాత్మలో పరమాత్మ నరసి కొల్చు
నట్టి అంతర్ముఖుని నే మహాత్ముడనెద! *

# నేను



ఈ లోక పాఠశాలలో –
అతిథి నైతి గాన
ఆరగింతు కొన్నాళ్ళు!

ఈ జగన్నాటకశాలలో -
నటుడనైతి గాన
నటియింతు కొన్నాళ్ళు:

ఈ ప్రపంచకార్యాలయములో
ఉద్యోగినైతి గాన
నిర్వహింతు కొన్నాళ్ళు!

ఈ విశ్వవిద్యాలయములో -
విద్యార్థినైతి గాన
అభ్యసింతు కొన్నాళ్ళు!

ఈ వసుధైకకుటుంబములో -
సభ్యుడనైతి గాన
సాగింతు కొన్నాళ్ళు!

## గాయకుడు

విరుల తావుల బాడు వింత గాయకుడ!
మరులుగొలుపు నీ అమరరాగఝురులు
తేనియలొలుకు నీ తీయని పలుకు
మానసమందున మాయక నిలుచు!
మాయలో దేల్చు నీ మహితగానమున
వేయికోయిల లైన వెఱగందునోయి!
కదలవో నీ గొంతు కరగంగ జూచి
సెలయేళ్ళు నీ ముందు సిగ్గందునోయి!
చెలరేగు నీలోన చిత్తమ్ము లూగ
మలయానిలస్వామి మది గుందునోయి:
బంధించు నీ రాగభావనాంగణమున
కంధరవ్రాతము కలతందునోయి!



మిన్నందు నీదు గీతోన్నతి ముందు
కిన్నరబృందము కేల్మోడ్చునోయి!
నీ దివ్యగాన వినిర్మలజ్యోతి
నా దుఃఖతిమిరమ్ము నణగించునోయి!
మినుకు మినుకుమని మెఱయు తారలును
నిను జూచి నిలుచునో నిశ్చలముగను!
కదలునో గిరులైన గానమాంత్రికుడ!
హృదయసీమల నేలు ప్రేమగాయకుడ!

## కళామౌని



కొన్ని కావ్యమ్ముల గొను పనిమీద
మున్నొకపరి పట్నమున కేగుచుంటి -
గుమిగూడి యొకచోట కొందఱు జనులు
అమిత ప్రీతిగ నేదొ అరయుచున్నారు!
ఏమున్నదోయని యేనును జూడ
గా మది గోరి అక్కడికేగినాడ!

ఎప్పుడా వీధులందే తిర్గు వాని
నప్పుడు జూచితి నచ్చోట విడిగ!

బిచ్చమెత్తుకొని జీవించెదు నతడు
పిచ్చివాని వలె గాన్పించును మనకు!

చినిగి మాసిన చొక్క, చింపిరి జుట్టు –
పనికిమాలిన వానివలె నుండునతడు!

కానీ, అతనిలో నొక కళావిభూతి
మౌనముద్రాంకితమార్గ మూనినది!

రస భావభరిత చిత్రాలనెన్నిటినొ
మసిబొగ్గుతో వ్రాయు మహిమాఢ్యుడతడు!

మానిసి నరసి, బొమ్మగ గీసి, క్షణము
లోన జూపించు నేర్పున్నదాతనికి!

గతమున బోయిన ఘనుల నందఱిని
బ్రతికించి రప్పించు బ్రహ్మయే అతడు!

తలపుల బరువుతో తల వంచి, ఆట
వెలదుల స్మరియించు వేమన్న యచట;
ఉద్ధరింపవలె ఈ యుర్వినటంచు
బుద్ధుడు ధర్మము బోధించునచట;
తులువలు చేసిన ద్రోహము వలన
సిలువెక్కి క్రీస్తుడు చింతిల్లు నచట!
ఎందటెందఱ స్మరించునో తాను
అందఱ బేర్కొన అది నా తరంబె?
దిటవుదప్పి వగచు దేవదాసు వలె
నటియించి మెప్పించు నాగేశుడటనె;
కటికవాని చేతిన కత్తిని గాంచి
పుణ్యమున మేక వాపోవునటకె!
బోనులోన ఎలుక పొక్కు నచ్చటనె,
బోనుబైటను పిల్లి పొంచునచ్చటనే!
చెట్టులచేమల చిత్రించునతడు!
పుట్టలగుట్టల బుట్టించునతడు!
కుక్కను, నక్కను క్రోల్పులిన్ గీయు
నెక్కడెక్కడి వెన్నో సృష్టించునతడు!
ఎన్నెన్ని ఊహల్ స్ఫురించునో తనకు
అన్నియు బొమ్మలై యగపడున్ మనకు!

పలికి తెల్పంగవీల్వడనట్టి వెన్నొ
నలుగీతల నిమిర్చి ప్రకటించునతడు!
పరమేశుడచ్చోట ప్రళయతాండవపు
దరిసెన మిచ్చును తన భక్తతతికి!
రాములవారి చిత్రముజూచి అచటి
గ్రామీణు లతిభ క్తిగా నతులిడిరి!
కవి కాళిదాసు వాగర్థములన్న
శివపార్వతుల గూడ చిత్రించె నతడు!
తన సూక్ష్మబుద్ధికందని లోతులేదు!
తన కళాశక్తికందని యెత్తులేదు!
పిచ్చిరూపును దాల్చి వీధులందెటనొ
స్వేచ్ఛగా తిరుగు ఆ చిత్రలేఖకుడు!
చేయెత్తి సన్నలు సేయునే కాని,
వాయెత్తి సుంతయు వాకొనలేదు!
అట్టి కళాహృదయమ్ముతో పాటు
పుట్టెనే వాని కీ మూగతనమ్ము?
అతని నోటికి గల దా మూగతనము!
అతని హస్తము మాత్ర మా వెల్తి దీర్చె! *

## కవి సమ్రాట్టు

అది కథయైనను, అది నవలైనను,
తనదైన భావమే తనది కాగ -
అది పాటయైనను, అది మాటయైనను,
తనదైన బాటయే తనది కాగ –
అది పద్యమైనను, అది గద్యమైనను,
తనదైన శైలియే తనది కాగ -
అది కావ్యమైనను, అది దృశ్యకావ్యమై
నను, తనరీతియే తనది కాగ -
ఒకటి కాదు, రెండును గాదు, సకలసాహి
తీ వివిధవిధానములెల్ల కైవసమ్ము
కాగ - విశ్వవాఙ్మయ శుభాకారులైన
విశ్వనాథ వారికివె వేవేల నతులు!

ఎన్నెన్ని 'జ్ఞానపీఠ'గ్రహీత మహత్తుల నెంచు
కొన్నను భావనావధులకున్ మిన్నలై నిల్చునౌర!
ప్రోన్నత శైలశృంగములు, పూర్ణగభీరవార్నిధులు
సున్నలు సున్నలై యెటనో సూక్ష్మమ్ములై పొల్చునౌర!

ఎక్కడోయున్న నన్నరసి - ''ఈ కవి యొక విధమైన
చక్కని పద్యము వ్రాయజాలిన భావుకు'' డంచు
మిక్కిలిగా సంతసించి, మేలిదీవన లిడినట్టి
ఇక్కవి సమ్రాట్కృపార్ద్ర హృదయోన్నతిన్ సన్నుతింతు! *

## నవయుగ కవిచక్రవర్తి

అల్పాక్షరముల అనల్పార్థచిత్రమ్ము
          లను జూపు ఇంద్రజాలమ్ము వాడు!
చదువు కొలంది ఆసక్తి నిబ్బడి సేయు
          నవతలూరెడు కవనమ్ము వాడు!
కవితోపయోగము, కవితా ప్రయోగము –
          రెండింటి లోతు దెలిసినవాడు!
సంస్కరణాభిలాషయు, సంప్రదాయాను
          రక్తియు జోడించి వ్రాయువాడు!
వేషమందు, ఆకార విశేషమందు,
పలుకు తీరులందు, వరాల తలపులందు -
నిలువు నిలువెల్ల అచ్చపు తెలుగువాడు!
సరసమూర్తి జాష్వా కవిచక్రవర్తి!

కవితకు నాణెమైన నుడికారపుసొంపును గూర్చి, సర్వమా
నవ సమతావిధుల్ తెనుగునాట విరాజిల జేసినట్టి త
త్త్వవిమల సాహితీకిరణరాశిని, జాష్వ మనీషి శేఖరున్,
నవకవిలోకనాయకుని నా మది భావనసేతు నెప్పుడున్

తాను పట్టిన అంశమేదైన గాని
పసిడి గావించిన కవితాస్పర్శవేది
అతడు! ముదిమి, మృతియు లేని అద్భుతకవి
తాత్మదివ్యస్వరూపమై అలరునతడు! *

## నేను వ్రాసిన లేఖ

వందనమ్ములు, తుమ్మలాన్వయ కవీంద్ర!
ఓ! మహాకవీ! చేరె మీ ఉత్తరమ్ము !
పూర్ణవాత్సల్య సద్భావపూరితమ్ము!
నన్నపార్యుని ''నిండు మనంబు'' పద్య
మన్వయించును మీకు ఓ! అమృతహృదయ!
కొన్ని సన్ని వేశములందు మున్ను నేను
మీ యెడ న్నడచిన తీరు, మీరు నాడు
నన్ను మందలించియు నేడు నా విషయము
నందు జూపిన కూర్మియు అరసి చూడ
దారిదప్పిన బిడ్డడు దరికిజేరి
నపుడు మన్నించి ప్రోచిన అయ్య కతయె
చిత్తమున దోచి, నా కనుల్ చెమ్మగిల్లె!

ఏదో రుగ్మత మిమ్ము బాధించుచున్న
దనుచు మీ కమ్మ వివరించె! అనుగుతల్లి
బాస కోసమై మీరెంతొ బడలినారు!
త్యాగమయమైన మీ జీవితమున కెట్టి
సిలుగు గలుగరాదనుచు ఆశింతు నేను!
సర్వరోగహరణశక్తిశాలి యైన
దేవదేవుని కృపచేత తిరిగి మీకు
త్వరగ చేకూరుగాత స్వాస్థ్యమ్ము! సుకవి
వర! కొనుము నాదు కవితాభివందనములు:

## నాకు వచ్చిన లేఖ

ఓయీ! ధనేకుల కవీ!
నీ యుత్తరమిపుడు వచ్చె, నిర్భర హర్ష
శ్రీ యందితి దీనింగని,
నీ యెదలో నొక సుధాధునిన్ గనుగొంటిన్!

మది తియ్యన గల మానిసి
యెది పల్కిన నింపు వొడము నితరుల; కెపుడో
వదరితి నంటివి నిన్నది
ముది నగుటన్ గుర్తు లేని ముచ్చట యయ్యెన్!

ఏను బద్దులేని మానిసి నగుట నా
పలుకునందుఁగొంత పలుకు తోఁచు!
క్రుధయు నన్ను విడని గుణము కావున నిన్ను
వంటి కుఱ్ఱ నేఁతు వాఁడి మెఱసి!

ఈవు పిన్న వైన నేమి నన్ వేఱుగాఁ
దలఁప వలదటంచు వెలఁది యెడఁద
నుగ్గడింతు నీకు నుద్వేల సాహితీ
విభవ మావహిల్ల నభిలషింతు! - తుమ్మల

## తెనుగులెంక పుట్టుపండువు

సకలాంధ్ర దేశీయులార! సాహితీ ప్రియులార! లెండు!
ఒక పుట్టుపండువు జోతి నూరూర వెలిగింప రండు!
అకలంకచరితుడు, తుమ్మలాన్వయాంబుధి సుధాకరుడు,
సుకవి సీతారామమూర్తి శుభజన్మదినమహో! నేడు!

ఎప్పుడీ సత్కళాపూర్ణు నీక్షింతునో చిత్తవీథి
నప్పుడా సుమనోజ్ఞ భావనాత్మక సంక్రాంతి కృతులె
చప్పున స్ఫురియించు నాకు సరసుడీ కవితాతపస్వి
మెప్పు లమేయముల్ కొన్న మేలికబ్బములెన్నొ మెఱసె

ఘనతర సన్మానతతుల గావించి, యీ 'గాంధీకవి' ని
తెనుగునా 'అభినవ తిక్కన' గా వినుతింప
తనకు దానే తన్మహాపదము మాని, నమ్రతనూని,
'తెనుగులెంకను నే' నటంచు తృప్తివహించె ఈ సుకృతి!

కవిలోకమందు సత్కవులు కానీ, మహాకవుల్ కానీ,
ఎవరికి వారుగా వత్తురే కాని - తాదృశులై న
కవులలో నెప్పుడో అరుదుగా నుద్భవించుచుందున్ సు
కవి, మహాకవియు నిర్వురు నొకండుగా 'తుమ్మల' వోలె

పుట్టుపండువు లెన్నొ చేసి, పూదండ లెన్నెన్నొ వేసి, -
కట్టుపంచెలు, సాలువుల్, నగదులిచ్చినంతనే లెక్క
పెట్టడు 'రాష్ట్రగానకవి'! విశ్వహితమ్ము గాంక్షించు
నట్టి తత్కవితాశయమ్ము లాచరింపవలె ఆంధ్రాళి! *

## మా ఊరి రెండు కొండలు

భావనాంబరగామిని, బ్రహ్మరాజ్ఞి
యైన వాగ్దేవి హృత్సీమ పైన నివ్వ
టిలెడు సాహితీ సంగీతములను బోలి
యుండు మాఊరి కొండలీ రెండునెపుడు!

చేరి బైరాగులిర్వురు చిల్మపొగను
పైకినూదు తఱిన్ దోచు వారి సిగల
వలెనె - శిఖరాల చిరుమబ్బు లలమి కొనగ
నుండు మాఊరి కొండలీ రెండునపుడు.

క్షీరధారాభిషేకంబు సేయబడెడు
జంటపుట్టల సొగసును స్మరణ కీడ్చి,
నిండు పున్నమ వెన్నెల పండురేల
నుండు మాఊరి కొండలీ రెండునపుడు!

గాఢతిమిరమ్ము గ్రమ్ము పక్షాంతరాత్రి
అంధకారమనెడు వర్ణమటనే రెండు
చోట్ల చిక్కగా పడెనన్న స్ఫూర్తి దెచ్చు
చుండు మాఊరి కొండలీ రెండునపుడు!

ప్రక్క ప్రక్కలనే నిక్కి, పంకమందు
నడుముదాక కూర్కొనియున్న నల్లకల్వ
మొగ్గకవ పోల్కి తిలకింప ముద్దులొల్కు
చుండు మాఊరి కొండలీ రెండునెపుడు!

రెండు బొగ్గుగుట్టల రీతినుండి, మరియు
రెండు మినుపరాసుల భాతినుండి, చూచు
వారి నత్యంతసమ్మోదకుల జేయు
చుండు మాఊరి కొండలీ రెండునెపుడు!

ఆరయ ఎడారియోడగా పేరుగొన్న
ఒంటియకు వెన్ను పైనున్న జంటమూపు
రాల మాద్రిగా నిల్చి, హర్షంబు నొసగు
చుండు మాఊరి కొండలీ రెండునెపుడు

మావటీని ఆనతి విని, మస్తకములు
వంచి, కరముల్ ముడిచి, మోకరించి, నమ్ర
తోన్నతాశయమున మ్రొక్కుచుండెడి సుక
రిద్వయంబు మాఊరి గిరిద్వయంబు!

ఎప్పుడో గట్టిగా మరణించు నరుడు
ప్రాకులాడును జీవితభ్రాంతి లోన,
ఎన్నడును మృతింపని యీ మహీధరములు
సంచలింపవు జీవితాసక్తి లోన!

క్రొత్తవాండ్రైవ్వరై నను గుర్తులేవొ
నుడువగా వలె నీ పుట్టినూరి కనిన –
కొండగుర్తుగా నిదె నిల్చుకొండటంచు.
కొండ లీ రెంటి నేను పేర్కొందునెపుడు!

ఇట ఊరెన్నడు ఉద్భవించినదొ కానీ, ఊరిలో నెప్పటె
ప్పటి రామాయణభారతంబులను సర్వంబున్ సమీక్షించుచుం
డుటకెంతే నలవాటునం బడిన జ్ఞానుల్ కొండ లీ రెండు వా
గుట కే మాత్రము నిచ్చగింపని మహాగూఢార్థ మౌనాకృతుల్

దినమందే ధృతిమీర చెప్పి, మరి రాత్రిన్ దోపిడింజేయు కీ
ర్తిని దేశంబున నాల్గుమూలలకు వ్యాప్తంజేసె ఏ చిత్రవ
ర్తను డా పున్నయ నామకుండయిన చోరాగ్రేసరుండెప్డొ దో
చిన బంగారును ఆ సొరంగమున నిక్షేపించె నండ్రిప్పుడున్!

జనపదమంతయున్ వడకి సావగ, మీసములెప్డు త్రిప్పుచున్
కను లెరు పెక్క జూచు అతికాయుడు, కాలుడు, ఆండ్రు పెక్కురుం
డిన మొనగాడు; తానిచటనే కనవచ్చెడి చట్టుపై కుటీ
ర నిలయుడయ్యె నందురవురా! మును పాములకోటయాఖ్యతోన్!

ఊరున్నాడును ఘోరగర్జల కరంబూగించి, మున్నెన్నియో
మారుల్ దూడల మేకలెన్నిటినొ సంహారించి తిన్నట్టి ఆ
క్రూరవ్యాఘ్రము తద్గుహాలయమునన్ గోండ్రిల్లుచుండన్, మహా
ధీరుండై వధియించె నాయడు లసత్కీర్తిద్యుతుల్ పర్వగన్ !

చిననాడే తలిదండ్రులిర్వురు దివింజేరంగ, తానవ్వ చెం
తను పెంపూనిన చిన్నిమన్మ డతనిన్ దౌర్భాగ్యుడెవ్వండొ చం
పెను ముక్కుంజెవినున్న పైడికొఱకా వీక్షింప గాన్పించు చ
ట్టునకుం జాటున! శిష్టుడున్ మరియు దుష్టుండు న్నరుండే కదా!

రాతిపొరల్ పెకల్చి, యొక రాతిరిలో నొక మాయకాడెదో
రీతిగ కొంచె మాకృతుల సృష్టి యొనర్చి, ఖగేంద్రుడున్ మరు
త్సూతియు ఈ గుహన్ వెలసె చూడగ రండని దుష్ప్రచారమున్
రోతగ జేసె గ్రుడ్డిప్రజలున్ గొఱియల్ వలె పోయి మ్రొక్కగన్;

ఇక మెట్లెక్కుచు పైకిపోవ, మలపై నెప్డో సృజించెన్ నరుం
డొక దేవాలయమందులో నిలిపె దేవుండంచు చెన్నాఖ్యతో
నొక పాషాణపు విగ్రహమ్ము నిపుడోహో! జారచోరాదులుం
టకు వీలై జరిగెన్ తదాలయ కవాటచ్ఛేదన ప్రాప్తియున్!

దరిగా కోవెల ముందరం గల ధ్వజస్తంభమ్ముపై నున్న ఆ
చిరుగంటల్-చిరుగాలి తాకిడులకున్-చిన్నారినాదంబులన్
పరమానందకరంబు కాగ నొనరింపన్, శ్రోతృచిత్తంబులం
దరయన్ తద్రమణీయ దృశ్యమొక ముద్రన్ గట్టిగా వైచెడున్!

ఇచ్చట నిల్చి చూపు ప్రసరించెడు నంతటిదాక చూడగా –
పచ్చని చేలు, నీలగిరిపంక్తులు, వన్నెల మేఘమాలికల్
ముచ్చట, గొల్పచుండ - నిటుమూలగ వీధులతో, గృహాలతో,
అచ్చపు బొమ్మరిండ్లకొలువై కనువిందగు మాదు పల్లెయున్

నేనీ శైలము లెక్కి, యెక్కి, యెటనో యేకాంతమందుండి, నా
లోన న్నేనుగ లీనమై కవితనాలోకించు తద్వేళలన్ –
నానా భావములేవొ మానసమున్ నాట్యంబు గావింపగా –
నేనట్లొంటిగ నుండియున్ పదుగురందే యుండునట్లుండెదన్!
మౌనంబూనియు నెందరో జనులతో మాటాడునట్లుండెదన్!

చెలికాండ్రతో ఆడుకొనుచు, చిన్నప్పు డీ గిరిసాను
వుల విహరించితి! ఇచట బుట్టిన కోనేట స్వాదు
జలముల గ్రోలితి! ఇచటి జారుడుబండల మీద
చిలిపిగా జారితి! ఇచటి శిలల నా పేరు మలచితి!

ఆనాటి నా ప్రాణమిత్రులందు కొందఱు నేడు లేరు!
కానగరాని యే పరజగత్తున కేగిరో వారు!
పూని జీవనలత నుండి మొగ్గల ద్రుంచెనే మిత్తి?
మానని గాయాలనిడెనె మదినిండ నెడబాటు కత్తి?

ప్రొద్దు పొడుచు వేళ, మరియు ప్రొద్దు క్రుంకెడు వేళ నేను
ఇద్ధరాధర శిఖరంబులెక్కి, ప్రాక్పశ్చిమదిక్కు
లొద్దిక ఏకరాగమున నొప్పెడు భావము గాంచి -
బుద్ధినెంచితి చావుపుట్టువుల్ రెండును సమానమంచు!

వాయవ్య మూల ఈ గిరుల పజ్జనే దిగువలో నున్న
ఆ యెలమాని తోపునకు - ఆ పలు పూలతోటకును
బాయక వాసంత వేళ వచ్చి ప్రొద్దులు బుచ్చుకొంటి,
కోయిల కూతలన్ వినుచు, క్రొత్తకైతల నల్లుకొంటి!

చక్కని ఆంధ్ర సత్కవన సాహితికిన్ దోహదముగ
నొక్కెడ తెన్గు సంస్కృతరసోక్తులు హత్తుకొన్న గతి
అక్కడి ఆ సుమారామ మందెటు చూచినన్ ప్రక్క
ప్రక్కలనే మల్లియల్ గులాబుల్ గుబాళించునౌర!

అవియివి యేవియో తలపు లంతుపొంతయు లేక పుట్టి
శివమెత్తి నూత్న కవిత్వసృష్టికై తహతహపెట్ట -
ఎవరేమి యనుకొన్నగాని యేమియు బట్టించుకొనక,
పవలురేయనక, యీ గిరులపై కెగబ్రాకితి నేను!

కొన్నాళ్ళు బాల్యఖేలనము, కొన్నాళ్ళు చిత్రలేఖనము,
కొన్నాళ్ళు సన్మిత్రగోష్ఠి, కొన్నాళ్ళు సాహితీసృష్టి,
కొన్నాళ్ళు తత్త్వచింత, సమకూడె ఈ కొండలచెంత
ఇన్నిన్ని వన్నెల వెల్గె నిచ్చోట నా కళాజ్యోతి!

## ముదిమి

జీవనవాటిలో జేరి ఆకులపాటు
నొనరించు శిశిరపాలనము ముదిమి!
బహువత్సరాలుగా బ్రతుకునీడిచికొన్న
చెడ్డపనికి బడ్డ శిక్ష ముదిమి!
తనువులో, తలపులో, తక్కిరి బిక్కిరి
మార్పుదెచ్చెడు తిక్కమందు ముదిమి!
మనుగడ కొంచెము, మరణము కొంచెము
పంచుకొనెడి దురవస్థ ముదిమి!
గడచిపోయిన కాలపు గాథలెన్నొ.
మరచిమరవక యెంచు సమయము ముదిమి!
జీవితసుదీర్ఘయాత్రలో చిట్టచివరి
బెట్టిదపు ఘట్టమై పుట్టు వెట్టి ముదిమి!
ఎవ్వరైనను గాని పెక్కేండ్ల పాటు
జీవితమ్ము గడుప వాంఛయు గాని,
వత్సరానేకముల తరువాత ఏగు
దెంచు వార్ధకమున కేవగించుకొనును!
వర్షములనెన్నొ నెఱపి ఆ పైన జీవి
తాంతిమాంకమై ప్రత్యక్షమౌను ముదిమి!
కాని, యెప్పుడేని తన యిష్టమైన యపుడ
భరతవాక్యమగుచు వచ్చి వ్రాలును మృతి!
చిత్రమైనది నా కవిజీవితమ్ము!
బాల్యమందు యౌవనము, యౌవనమునందు
వార్ధకము నందుకొన్న భావనలు నావి!
ఇప్పు డేండ్లు పైబడి ప్రాయమేగుచున్న
కొలది యువకుడుగా, బాలకుడుగ, శుద్ధ
ముగ్ధశిశుమూర్తిగా మారిపోవుచుంటి!

## ఆషాకుమారి

అలవికాని దారుణరుజా విలయరూప
మూని మృత్యుదేవత తనలోన, తన ప
విత్ర దేహాలయములోన భీకరముగ
పొంచి పొంచియుండుట గమనించికూడ
జాలిగా నవ్వుకొనియె ఆషాకుమారి!

పసుపుగుంకాల కల్మి, జీవనపు చెల్మి
ముద్దుముచ్చటలెవ్వియు పొందనీక -
ప్రాయమేని గడవనీక - ప్రాణధనము
నెల్ల గబళించుకొనిపోవు మృతిని గాంచి
జాలిగా నవ్వుకొనియె ఆషాకుమారి!

అతి నిరంకుశ శాసనోద్ధతిని జూపు
మృత్యుసమ్రాజ్ఞి సన్నిధి నెవ్వరేని
వెఱచువారె, బిట్టుగ విలపించువారె, -
యనెడు సామాన్యసూత్రంబు నతిగమించి
జాలిగా నవ్వుకొనియె ఆషాకుమారి!

## గీతాకుమారి

ఆమెలోని వేదన లామె మోమునందు
చిర్నగవు సుంత చేరనిచ్చెడివి కావు!
కాని, నాటి సాయంసమయాన మంద
హాసముఖియై నిలిచె నా గృహాంగణమున!

''బాబు! రేపు పండుగరోజు! బందుగులము
గాకపోయిన గాని మీ రాక తోడ
పావనము సేయవలె కవివర్య! మా ని
వాస'' మని వెల్వరించె ఆహ్వానమామె.

''రాకరాక వచ్చితివి, గీతాకుమారి!
పెక్కు నాళ్ళాయె నీ పాట వినుట జరిగి!
ఇప్పుడొక రమ్యగీతి విన్పింతువేని
అటులె మీ యింటి కేతెంతు'' నంటి నేను.

''ఇపుడు కాదులే బాబు! నాకెన్నో పనులు
గలవు, త్వరగ పోవలయు, నా గానమెల్ల''
రేపు విందురు గాక! మీ రాపుమనిన
వినక పాడెద నొక్కటే పెద్దపాట''

అనుచు, ''తప్పక రేపు రం''డనుచు, ''మా గృ
హమున మేమెల్లరమును మీ ఆగమనము
కొర కెదురుచూతు'' మనుచు, నాకు పలునుడుల
నిట్లు మరిమరి చెప్పిపోయినది తాను!

నేను మఱునాటి వేకువ నిద్రలేచి,
స్నానమొనరించి, నూత్నవస్త్రముల దాల్చి,
పూలుపండ్లును కొన్ని చేబూని, పయన
మైతి ఆత్మీయురాలి ఆయతనమునకు!

అత్తెఱగున గీతానిలయాంగణమున
కేను వచ్చితినో, లేదో, యింటినుండి -
ఆ యలంకృతమైన గేహమ్మునుండి –
శోకములు వినవచ్చె హృద్వ్యాకులముగ!

గుండెలో నెదో శంకించు కొనుచు, ఆ గృ
హాంతరమ్మున కేగి, నే నచట గాంచి
నట్టి దృశ్యమో: అతి విషాదాత్మకమ్ము,
నా కనులపై దొలగె నాకె నమ్మకమ్ము!

నన్ను ఎవ్వ రాహ్వానించినారో, ఆ స
హృదయురాలు పాన్పుపయి నున్నది సుదీర్ఘ
శాంతనిద్రలో మునిగి, ఆ శయ్య చుట్టు
గలదు బంధుకులంబు శోకాకులంబు!

ఎంత విపరీతపరిణామ మిది ఘటిల్లె:
తలచుకొన్న కొలది నా హృదంతరమున –
''పాడుదిక నొక్కటే పెద్దపాట''యనిన
రమణి నుడులె నేటికిని కలవరపెట్టు! *

# నాన్న

అపుడు నేనింతటి నిసువునై తప్పటడుగులు వేయు
నపు డీవు మము వీడి దూరమైతి వైననుగాని, నేటి
కిపుడిట్లు లీలగా నాదు స్మృతి లోన నిల్చియున్నావు.
అపర పల్నాటి బ్రహ్మన్న వాకృతి న్నీవు నా తండ్రి!

నీ సమున్నతమైన తనువు, నీ సువిశాల నేత్రములు,
నీ సొగసైన నాసికయు, నీ సిరులొల్కు మీసములు,
నీ సదామందహాసములు, నీ కృపాదరవీక్షణములు, -
నీ సుందరాకార మిట్లు నేటికి నాకు జ్ఞాపకము!

దిసమొలతో దుమ్ములోన దిర్గుచు, ఆడుకొనియెడు
పసిగాయనగు నన్ను నీవు పరమదయార్ద్రవాత్సల్య
రసమొల్కు కౌగిటం జేర్చి రతనాల కుద్దులౌ ముద్దు
లొసగితి వా యనుభూతి యున్నదిప్పుడును నా హృదిని!

మునుపటి నీ ప్రాణమిత్రముల్ నేడు నెచ్చోటనైన
ననుజూచి, తమతమ నెమ్మనమ్ముల నిను దలపోసి,
కనులనుండి కవోష్ణబాష్పకణములు రాల్తు రా నాటి
ఘనమైన నీ చల్లని చెలికార మాదర్శమెల్లరకు:

ముత్తియముల ప్రోవులైన మోహనాక్షరపంక్తు లీవు
చిత్తుపొత్తము లం దటనట చేతితో లిఖియించినావు!
చిత్తరంజకమైన నాదు చిత్రలేఖనమందు గూడ
మొత్తము మీద నా రూపమున నీవె రచియింతువేమొ!

నేను జనించిన నాడె, నీవు వచించిన జోస్య
మీనాటి కీ రీతిగా ఫలించినదో! పితృదేవ!
ఐనవారెవ్వరు గాని, ఆనాటి యొజ్జ లెవ్వారు
గాని, తలంపని రీతిగా కవినైతి నేనిట్లు!

## అన్న

అయ్యయో, అన్నయా! ఎంత అన్యాయమొనరించి పోయి
తయ్యా! ఒకటి వెన్కనొకటి యాతనలేతెంచు రీతి
అయ్యెనో, లేదో, యేడాది యైనను నాన గతించి,
అయ్యశ్రుధారలు సుంత యారక ముందె యిట్లయ్యె!

ఎన్ని సమస్యలు మూగి, ఎన్ని యాలోచనల్ రేగి,
ఎన్ని యూహాద్రులు పగిలి, ఎన్నెన్ని వేదనల్ రగిలి,
భిన్న మొనర్చినవొ కద బెదరిపోయిన నీ యెడదను!
ఛిన్నమొనర్చెను కద చెదరిపోయిన నీ బ్రదుకును!

అంత మెత్తనివాడవయ్యు అమ్మకడ్పున జిచ్చుపెట్టి,
అంతులేని విషాదవార్ధి యందు మమ్మందఱ ముంచి,
ఇంతగా గుండె రాయి నొనరించుకొని, యొకింతయేని
చింతింపకేల క్రుంకితివొ చెప్పుమన్నా కూపమందు!

చూడ చక్కని కుఱ్ఱడంచు, సుగుణ రత్నాకరుండంచు,
వాడవాడల నిను మెచ్చువారును - మునుముందు నెంత
వాడౌనొ యంచు ఆశించువారును - వాపోవ, బ్రతుకు
జాడ కవ్వలి యే ప్రశాంతసీమల కేగినావు!

నవయౌవనపు బెండ్లియాడు నందాక, పదునెన్మిదేండ్లు
భువిమీద నుండి, యీ గడ్డపోక లెవ్వియు సోకనీక,
దివినుండి దిగివచ్చి దివికె తిర్గిపోయిన దివ్యరూపు
డవు, మింటిచుక్కవై యెటనో దాగి వీక్షింతువు నన్ను! *

## చిన్నాన్న

చిన్నాన్న గతియించెనన్న చిత్తమున్ దహియించు కబురు
కన్నీరు మున్నీరుచేసి కలవరపెట్టెను నన్ను!
ఇన్నాళ్ళు ఈ లోకమందు ఏ పాటి ఆనందమందు
కొన్నది లేకయే గడుపుకొన్నాడు బ్రతుకెల్ల తాను!

ఖననకాలాన చిన్నాన కాయము పై నింత మృత్తి
కను మునుముందు నే జల్లగా, నపు డైనవారెల్ల
రును మన్ను వోయు తక్షణమ రుండము మాత్రమే మిగిలి
తనువెల్ల పూడిపోయినది ధారుణీవ క్త్రమ్ము నందు!

''నాకిక కానరావు కద నాయనా'' యని పట్టరాని
శోకముతోడ ఆ దెసకు జూచుచు, తల్లడపడుచు.
వ్యాకులాత్ముడనై తదుత్తమాంగము గౌగిలించుకొని,
భీకర రోదన ధ్వనుల విలపింపసాగితి నపుడు!

బ్రతుకు నందెంతయో కాచి వడపోసినట్టి మా తాత
ముదుసలొక్కడు వచ్చి, నన్ను బుజ్జగించుచు, ''ఏడ్వబోకు
మది మట్టిబొమ్మరా! నాయనా, కాదు చిన్నాన'' యనియె!
అదియేమొ, అంతటి నా మహాదుఃఖ మెటకేగినదియొ!

జీవితపాఠమందు మరచిన సత్యమేదో హఠాత్తు
గా వినిచిన తాతవాక్కు కట్టని సేతుపై నా మ
హా విలాపాశ్రుల నాపి, అంతరంగమున ప్రశాంత
భావానిలము రేపి, నన్ను బట్టి నిల్పె అచలమతిగ *

# అశ్రుమాల



ఓ! ప్రాణమిత్రమా ఓ, హేమ సుంద
రా! ప్రపంచగమన మ్మెరయనివాడ!
ఎందుకీ ధారుణి కేతెంచినావు?
ఎందుకీ మేదిని నెడబాసినావు?
ఏల మృత్యువునే వరించు తలంపు
నీ లోన బుట్టెరా నెచ్చెలికాడ?
ఆటలెన్ని గలసి యాడుకొన్నామొ!
పాటలెన్ని గలిపి పాడుకొన్నామొ!
నడి రేయి నిదురనూడ్చి, నయనాల జీల్చి,
బడిపొత్తముల నెన్ని పఠియించినామొ!
గ్రామతటాకతీరాన వాహ్యాళి
కై మనమెన్నాళ్ళు గమియించినామొ!
ఎలదోటలో చూతవృక్షాల క్రింద,
మల పైన నెన్నెన్ని మారులున్నా మొ!
కొండపై కోనేటి క్రొన్నీరు గ్రోలి
గుండెకు క్రొన్నెమ్మి గూర్చుకొన్నామొ!
ఎండవానల జెడకుండ, కొండ పెను
గుండుపై మన పేర్లు గొట్టుకొన్నామొ!
ఒక్క కంచమ్మున ఓగిరమాని
ఒక్క మంచమ్మున ఒత్తిగిలితిమొ!
అట్టి మధురమైన హార్దంబు మరచి
మట్టి గలసితేల మందభాగ్యుండ!

శోకసాగర పరిశోధన జేసి
నా కొసంగవె భావనామణులెన్నో?
ఆనంద వేదన అందేది యైన
మానసస్థితి చేతి మారునన్నావె?
నాటికి, నేటికి, నానుండి నేను
మేటితనమ్మునే మెఱయించుచుంటి!
నేను గర్వింతును... నేను జన్మించి
నానని, యీ భువనమే నా గృహమని
జీవించుట జనించితి, జనించితిని
కావున జీవింపగా నెంతు నేను!
శాంతి గర్భమున అశాంతియే బ్రతుకు!
శాంతి వెలుపల అశాంతియే బ్రతుకు
పుట్టుక నుండి చావు కడకు సాగు
నట్టి నిట్టూర్పుల యాత్రయే బ్రతుకు!
బ్రతుకు నిరంతర రణమంచు నెంచి
ప్రతి మానవుడు యోధవరుడు కావలయు!
జీవితరంగాన స్థిర వీరుడెవడొ,
జీవిత సమరవిజేతయు నతడె!
మరణించుటకు బహు మార్గముల్ కలవు,
సరిగ జీవించు విషయమే దొరకదు!
చావు పుట్టుకలన్న చక్రమ్ము మధ్య
జీవిత చైతన్యచిత్రమ్ము కాదొ!

జీవించు తీరు నేర్చిన మానవునకె
జీవిత మానందజీవిక యౌను!
కళలెల్ల జీవితకళ ముందు రద్దు,
కళలకెల్ల అదియే కద సరిహద్దు:
కంటకమయమౌ జగన్నాటకమున
అంటియు నంటని యట్లుండవలదొ!
నాకు జెప్పిన ధృతి నీకు లేదేల?
నాకు నేర్పిన యోర్పు నీకు లేదేల?
భయసంశయాత్మ్కుడా, బ్రతుకును ద్రోసి
స్వయముగా చావు నాహ్వానించువాడ!
నిను భయపెట్టును నీలోని పిరికి
తన మొక్కటేగాని, తక్కినదేది?
బ్రతుక నేర్వగలేని ప్రజ్ఞాధురీణ!
వెతల కోర్వగలేని వీరాధివీర!
నిను మ్రింగు దానినే నీవేల మ్రింగి
కను మూసినావోయి కఠినసాహసుడ!
నిను నీవ త్రుంచుకొనిన మొగ్గ వీవు
నిను నీవ రాల్చుకొనిన పిందె వీవు!
మెత్తని కత్తికి మెడనొసంగితివి,
మిత్తి తల్లియొడిని మేను వాల్చితివి!
ఆశలమాల నిరాశలై యూడ
నాశన మందితో నా సంగరీడ ?

బ్రతుకుబాటను రోసి, బరువును ద్రోసి
వెతలూడ నేగితో వినువీధి కీవు!
సడి కన్న మేలుగా చావునే యెంచి
వెడలినావో భువిన్ వీడి నా హితుడ?
నీతుల బల్కుచు గోతుల దొల్చు
నేతల బ్రతుకులు నీకు దెలియవొ?
దేవుని పేరిట దేశాల దోచు
దైవభక్తుల జీవితాల నెఱుగవొ!
చీకటిబేరాల చిక్కులు పెట్టి
రూకల గుంజు చోరుల నీ వరయవొ?
రెక్కాడినగాని డొక్కాడదాయె,
డొక్కాడినంగాని రెక్కాడదాయె!
పెన్నిధులాయెరా పేదల పాట్లు,
పెన్నిధుల కొఱకే పెద్దల పాట్లు!
ఎందుకీ బ్రతుకులు? ఎందుకీ కతలు?
ఎందుకీ గతుకులు? ఎందుకీ వెతలు?
రోతగా బ్రతికిన రోజుల కన్న
నీతిగా బ్రతికిన నిముసమే మిన్న!
మానవత్వము లేని మానవుండున్న
వానరమున కన్న వాడేమి మిన్న?
చంచలలక్ష్మి జగతియందెల్ల
వంచనలెన్నియో ప్రబలు నెల్లపుడు!

ధనకేంద్రమును గొని ధారుణీ వృత్త
మును సృష్టికారుడే మును గీసెనేమొ?
పరువు పెరుగు, రూపబలములు పెరుగు,
అరయ అర్థంబుచే అన్నియు పెరుగు!
సిరుల కొఱకు ప్రజ జీవించుచుండ
పరువు కొఱకు నీవు మరణించుటేల?
ఆమని వంటిది యౌవన మట్టి
ఆమనిలో నిన్ను వ్యధలెన్నొ కొట్టె!
కష్టాలనే మ్రింగి, కన్నీళ్ళు ద్రావు
నష్టజీవితమున నలిగినావోయి!
గట్టున నెక్కడో గగ్గోలుపడుచు
నట్టేట మున్గిన నావవైనావు!
కారుచీకట్లెన్నొ క్రమ్ముకొన్నపుడు
దారిదప్పిన బాటసారి వైనావు!
తెరువేదొ తెలియక దురసిల్లు నిన్ను
దరిజేర్చుకొనని బాంధవులను మరచి -
కరుణ సుంతయు లేక కఠినవైఖరిని
పరిభవమొనరించు పరులను విడిచి -
నాబోటి హితునకైనను చెప్పుకొనక
నీ బాధల బరువు నీవె మోసికొని -
దిక్కు మొక్కును లేని తిరిపరి వోలె
ఒక్కండవై యెక్కడో విలపించి -

పరలోక మేగిన పరమపావనుడ!
చిరకాల మిత్రుడా! శిథిలహృదయుడ!
నీ జీవితమ్మిట్లు నిర్మూలమౌట
నీ జాతకమ్మునందే కలదేమొ!
కాళరాత్రులు నిన్ను గబళించు వేళ
తాళగిరిస్వామి తా జూడలేదొ?
కట్టెలో కట్టెవు కాయమైనావు?
మట్టిలో మట్టివై మాయమైనావు?
అవనిలో ఏస్థితి నందుకోలేక -
అవకాశమే లేక - అడుగంటినావు!
బాధలందున జిక్కువడిన ధీబలము
ఆధారశూన్యమై అంతమందు కద.
శకలభాండము లోన జలమెట్లు నిల్చు?
వికలచిత్తమున జీవిత మెట్లు నిల్చు?
మండువేసవి వంటి మనుగడ నుండి
పండువెన్నెల దారి బట్టితివోయి?
మరణంబు తరువాత మానవుండెచటి
కరుగు? ఏమగునంచు అరసినావేమొ?
నాకము నరకమీ లోకంబు నందె
నాకు గన్పించుచున్నవి నా సఖుండ,
నీతి నియమములు నిలువనిచోటు
పాతాళమున కన్న పరమహీనంబు!

నీతి నియమములు నిల్చుటే నాడొ
భూతలస్వర్గంబు పుట్టునా నాడె!
నీ వలె నెందరో నిర్మల మతులు:
నీతికి బలులైన నిర్భాగ్య గతులు!
వారలధికులని, వీరధములని,
మారణశక్తికే వారయు లేదు!
ఏనాటికైనను, ఎంతటి వారి
కైనను తప్పదురా మరణంబు!
ఎవడెన్ని నేర్చిన ఈ కూటి కొరకె!
ఎవడెంత ఘనుడైన ఈ కాటి కడకె!
చదువులు, పదవులు, సంపదల్ కూర్చు
మదములెల్ల తుదకు మరణంబునందు
ఎప్పటికేని చెల్లింపవలసిన
అప్పు కదా ప్రాణ మఖిలజీవులకు
ఏవేళకైనను మృత్యుసాగరుని
జీవననదులెల్ల చేరును తుదకు!
తనలోని ప్రతిజీవితము లీనమౌట
కెనలేని రూపాల నేతెంచు మిత్తి!
కోడిపిల్లను దన్నుకొని పోవునట్టి
ఆ డేగ వలె మృత్యు వరుదెంచునంద్రు!
బ్రతుకన్నచో ప్రీతి ప్రబలమౌ కొలది
మృతియన్నచో భీతి మిక్కుటమౌను.

కారుణ్యమున కన్న కర్తవ్యమరయు
మారణదేవత మహితాత్మురాలు!
ఇందుకేనియు గాని లంచంబు గొనదు,
ఎంచిచూడగ మృత్యువే మంచిదోయి!
పవలు వెన్కనె రేయి వచ్చునట్లు, బ్రతు
కు వెనుకనే మృతికూడ యేతెంచు!
విశ్రాంతి లేని జీవికి చాలినంత
విశ్రాంతి నొక మృత్యువే యిచ్చునోయి!
జీవితమ్మున నిన్ను జేరని శాంతి
చావు తోడ శ్మశానశాంతియై దక్కు!
విసపు నవ్వులు నిన్ను వేధింపలేవు,
పసులచేతలు నిన్ను బాధింపలేవు!
భయదమౌ సంఘము భయపెట్టలేదు,
దయలేని లోకము దండెత్తి రాదు!
రోదనమున ముందు రోగాలు రావు,
పేదరికము పెంచు వేదనల్ రావు!
అదరదు ఉదరము ఆకటిలోన,
చెదరదు హృదయము చీకటిలోన!
మునుపటి దానికి మూగదు నొగులు,
మునుముందు దానికి మూల్గదు దిగులు.
కాకుల గోలకు, కాటి మంటలకు,
ఘూకాల కూతలకును లేవనీవు!
వడికింపలేదోయి వడగండ్లవాన,
జడియింపలేడోయి చండభాసుండు:

పెనుగాలి వీచియు బెకలింపలేదు,
తనువు జీల్చు చలియు తాకనేలేదు!
బాంధవ రోదన భారములకును
కొందలపడి లేచి కూర్చుండవీవు!
నిను నీవు మరచిన పెనుకూర్కులోన
ఘన ఘనాఘన ఘోష వినరాదు నీకు!
పరువు కూలెననెడు భ్రాంతియు రాదు!
సిరులు జారెననెడు చింతయు రాదు.
కులమతభేదాలు, కుటిలవేషాలు,
కలహాలు, కదనాలు చెలరేగవచట!
మనుజులు చరియించు మహిలోన నీకు
మనుజులే యిడుమల నొనరింతురోయి!
గాములే విహరించు కాటిలో నీకు
గాములు కలిగించు  బాములే లేవు!
నిత్యవసంతము నీ సమాధికడ
నృత్యము సల్పుట నిక్కమో సఖుడ!
కడచిన బెడదల కడలిని మునిగి
తడిసి వడకు నెడద దుడుచుకొనుము!
విశ్వనాథుండాడు వేదికాస్థలిని
శాశ్వతశయనవిశ్రాంతినిం గనుము.
శోకించి, శోకించి, సుఖనిద్ర జెందు
నీ కిదే నా మిత్రనేత్రాశ్రుమాల! *

## ఆత్మ నివేదన



"నిను నీవు దిద్దుకొనిన నా లోక
మును దిద్దు ఆదర్శమూర్తి వయ్యెదవు.
నీవు చేసిన మేలు, నీకైన కీడు -
నీవెప్పుడా రెంటిని దలంపరాదు;
దేవునొక్కని, మృత్యుదేవి నొక్కతెను
నీవెప్పు డీ రెంటిని మరవరాదు!
ఆనందసుజ్ఞానహర్మ్యాలు ఆత్మ
లోననే - నీ ఆత్మలోననే కలవు.
నిను నీవు కనుగొన్న నీవె దేవుడవు:
నిను నీవు కానవో నీవె బానిసవు!'' -
అని ప్రబోధించిన అవతారపూరు
షునకు నమస్కరించుచు విన్నవింతు -
సత్యసాయీశ్వరా! సద్గురుదేవ,
నిత్యము స్మరియింతు నీ దివ్యబోధ!
నన్ను నే జూచుకొనని వాడనయ్యు,
అన్నియు గని నట్లహంకరించితిని!
యోగీశ్వరుడ వీవె ఓ, ప్రేమమూర్తి,
యోగభ్రష్టుని నన్ను ఉద్ధరించితివి
ఇలలోని జీవాత్మలెల్ల నీ ప్రేమ
వలయమ్మునందె కన్పడుచుండె నాకు
ఈ జన్మమందె దర్శించితి నిన్ను
ఈ జీవితమ్మునకిది చాలు స్వామి. *

# గుంటూరు

## (గేయ కవిత)

సారస్వత వేత్తనెట్లోసామాన్య శ్రోతనట్లె
గుటిగనిల్పి కూర్చినాడగుంటూరును గూర్చి కైత.

## కృతజ్ఞత

ఈ నా ''గుంటూరు'' కవిత విశేష ప్రాచుర్యము నొందుటకు మూల కారణుడగు ఆలోకం పెద్దబ్బయ్యకు ముందుగా నా అభినందనములు, ఆశీస్సులు అందించుచున్నాను. ఈ గేయ ప్రచార బాధ్యతనెల్ల తానే వహించినంతగా ఈ కళారాధకుడు కావించిన సాహితీసేవ మరువరానిది.

ప్రథమ శ్రోతలై హితసూచనలొసగిన విద్వత్కవి వరేణ్యులు, సాహితీ ప్రావీణ్యులు, మాన్యమిత్రులునైన పెద్ది సత్యనారాయణ, పులిచెర్ల సుబ్బారావు, ఉయ్యూరు లక్ష్మీ నరసింహారావు, సుఖవాసి మల్లికార్జున రాయశాస్త్రి, దుగ్గిరాల రామమోహనరావు గార్లకును, కవిసభా సభ్యులకును నా కృతజ్ఞతాభివందనములు.

ఈ గేయములు వివిధ పత్రికలందు, సంచికలందును ప్రచురింపబడుటకు సహకరించిన సాహితీవేత్తలు, సంపాదక మహాశయులునైన మన్నవ గిరిధరరావు, నందమూరి సత్యనారాయణ (గుంటూరువాణి) జూపూడి అమ్మలయ్య, పోట్ల రామస్వామి చౌదరిగార్లకును, శ్రీనాధపీఠము, గుంటూరు కళాపరిషత్తు

''అవగాహన'' సంస్థ ఎస్.జి.కె. ఓరియంటల్ కాలేజి (తాడికొండ), జిల్లా పౌరసంబంధ శాఖవారికిని, లైన్స్ క్లబ్బు (పట్టాభిపురం, గుంటూరు) వారికిని, నా ధన్యవాదములు.

ఈ.టి.వీ. ''పాడుతా తీయగా'' సంగీత కార్యక్రమ సహాయదర్శకులు కె. రామ ప్రసాద్ గారికిని, మహాసభలో మనోజ్ఞముగ చదివి ఈ కవితకు గొప్ప గుర్తింపు సమకూర్చిన మహాగాయకులు **ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం** గారికిని నా ప్రత్యేకాభినందనములు.

ముఖచిత్ర రచన చేసిన ఆప్తమిత్రుడు పులిచెర్ల సాంబశివరావుకు నా శుభాకాంక్షలు. మొదటి నుండియు నా ''గుంటూరు'' కవితను విశేషముగ అభిమానించుచు, విస్తృతముగా ప్రచారమగుటకు సాయ పడిన పులిపాటి శ్రీదేవి (ఎల్.ఇ.ఎం. స్కూలు) గారిని అభినందించుచున్నాను, ఆశీర్వదించు చున్నాను.

- ధనేకుల

శ్రీవిద్యా ప్రపూర్ణయై
చిదానంద మొసగు నెలవు,
అచ్చమైన తెలుగుకొలువు,
అందమైన గుంటూరే !

తననీరే కవనప్రద
మని ఆడును కృష్ణవేణి;
తనతీరే కవితామయ
మని పాడును గుంటూరే!

పాడిపంట పొంగిపొరలు
పల్లెలెన్నొ చుట్టికొలువ
హారములో మేరువుగా
అలరారును గుంటూరే !

తనపేరును పెరసీమల
వినువారికి వెనువెంటనె
గోగాకునొ, పొగాకునో
గుర్తు సేయు గుంటూరే !

తెలుగువారి విందులందు
దివ్యమైన అంశముగా
మెప్పులందు గోంగూరకు
మేలిపాదు గుంటూరే !

ధనహీనుల, ధనవంతుల
తారుమారు గావించెడు
ధూమపత్ర వాణిజ్యపు
దుర్గమన్న గుంటూరే !




పండించినవాని కన్న
పైవారే లాభించెడు
ప్రత్తిబేళ్ళ వర్తకాన
ప్రఖ్యాతయు గుంటూరే !



ఎండుమిరప ఘాటునైన,
మండుటెండ ధాటినైన,
తట్టుకొనెడు దిట్టలున్న
పట్టణమ్ము గుంటూరే !

పనిసేయునొ, పనిసేయదొ,
అనుసంగతి యెట్లున్నను -
పురుగుమందు లన్నింటికి
పుట్టినిల్లు గుంటూరే !

అన్నదాత రైతన్ననె
ఆత్మహత్య గతికిదెచ్చు
మాయదారి విత్తనాల
మారికొట్టు గుంటూరే !

ఖ్యాతికొఱకు ప్రాకులాడు
ఆరాటపు వ్యక్తులకును,
ఆడంబర వక్తలకును
ఆరామము గుంటూరే !

ప్రతిభాన్విత గర్వముతో
పాండిత్యపు దర్పముతో
గీకరించు కాకవులకు
ఆకరమును గుంటూరే !

స్వల్పకవిత అల్లుకొనుచు
సభలలోన వినిపింపగ
ఆత్రపడెడు అల్పకవుల
కాదరువును గుంటూరే !

ఒకనికన్న పైచేయిగ
నొకడు మించనెంచుటతో
ప్రతిరంగము కడుపోటీ
పడు చోటీ గుంటూరే !

రాజకీయ వైరమ్ముల
రకరకాల వ్యూహమ్ముల
గడిదేరిన వ్యవహర్తల
విడిదికూడ గుంటూరే !

విద్యలోన విజ్ఞానము
విద్యలోన వ్యాపారము
నేర్పుచున్న, నెఱపుచున్న
నెఱజాణయు గుంటూరే !

ఎంత బేలకైన గాని
కొంత కాలమిట నిల్చిన
బ్రతుకనేర్చు కళను గూర్చి
వడిగ నేర్పు గుంటూరే !

జీవితమును, లోకమ్మును,
యావత్తును నొకేచోట
సూక్ష్మములో మోక్షముగా
చూపించును గుంటూరే!

ప్రతివీధియు, ప్రతిగొందియు
గతుకులతో, గుంటలతో
తనపేరును సార్థకమ్ము
నొనరించును గుంటూరే !

జాబిలిలో డాగువోలె
స్వల్ప దోషచయమున్నను,
ఎన్నెన్నో గొప్పతనము
లున్న ఊరు గుంటూరే !

ఏనాడో ఋషులిర్వురు
నిట ప్రతిష్ఠగావించిన
ఇరుగుడులకు చేరువగా
నెదిగినదీ గుంటూరే !

ఏనుగులే గుంపులుగా
తానమాడు పెనుగుంటలు
పెక్కులున్న ఊరుగాన
పేరువచ్చె గుంటూరే !

ఆంధ్ర శాతవాహనాన్వ
యాధిపతుల నాటినుండి
అతిపురాతనాంధ్రపురిగ
నుతిగన్నది గుంటూరే !

తెలుగుచోళ మన్నెరికము
వెలుగుచున్న కాలమందు
దండనాథు డధివసించు
స్థావరమీ గుంటూరే !

రాజ్యమ్మున కెద్దానికి
రాజధాని కాకున్నను
రాజధాను లెన్నిటికో
రాదారీ గుంటూరే !

ఈ తట్టున కిరీటమ్ము
లెన్నెన్నో మారినపుడు
ఒక కీలకకేంద్రముగా
నున్న ప్రోలు గుంటూరే !

తనవైపున గతమందున
కొనసాగిన చరితనుండి
వివిధరాజ్యగాథలెన్నొ
వినిపించును గుంటూరే!

తనచెంగట గిరికొమ్మున
మునుపెన్నడొ వర్ధిల్లిన
ప్రాజ్యరాజ్యపాలనమును
పరికించెను గుంటూరే !

తనముంగిట నదిగట్టున
మునుపెన్నడొ విలసిల్లిన
విశ్వకళాక్షేత్రమ్మును
వీక్షించెను గుంటూరే !

పరిశుభ్రపుగాలి వీచు
పచ్చనైన ప్రకృతితోడ
వాసయోగ్యమైన పురిగ
వాసిగాంచె గుంటూరే !

తనముందర మునుపెందరొ
జననాథులు, గురుపాదులు
తెరవెన్కకు తరలిపోవ
తిలకించెను గుంటూరే !

ఇట వాణీవీణారవ
మెటువోయిన విన్పడునని
విశ్వమెల్ల వినుతించిన
విద్యాపురి గుంటూరే !

తనచుట్టును వికసించిన
తరతరాల విభవమ్ములు
తనలోనికి ప్రసరింపగ
తానైనది గుంటూరే !

కవిబ్రహ్మల గన్నదిగా
కవికోకిల లున్నదిగా
కవిపండిత ఘనసన్నుతి
గైకొన్నది గుంటూరే !

పట్నములే పల్లెలుగా
పల్లియలే పట్నాలుగ
కాలగతిని రూపొందుట
గమనించెను గుంటూరే !

కవనశ్రీనాథులతో
కవనశ్రీమంతులతో -
తనదాపున, తనప్రాపున
ధన్యతగనె గుంటూరే !

ప్రభుత్వాలు మారుకొలది
పట్నముగా ప్రగతినొంది
ఒక జిల్లా కూడలిగా
నొనగూడెను గుంటూరే !

దేశభక్తులగు నేతలు
దీనబంధులగు దాతలు
తనవారలె తనపౌరులె
యని చాటును గుంటూరే!



న్యాయవాద వైద్యమ్ముల
ఆదర్శప్రతిభాఢ్యుల
నెందరినో ప్రజాసేవ
కందించెను గుంటూరే!

జ్ఞానభక్తి మార్గమ్ముల
సమన్వయము సాధించిన
తాత్వికమణులెందరొ గల
ధార్మికఖని గుంటూరే !

అటుతీర్థుల తరంగముల,
ఇటుదాసుల కీర్తనముల -
వెలికివచ్చి రాకమున్నె
వినియున్నది గుంటూరే !

ఓంకార క్షేత్రమిదే!
హ్రీంకార క్షేత్రమిదే!
రామనామ రమ్యక్షే
త్రమ్మునిదే గుంటూరే !

మతాతీత మహాజ్ఞాని,
మహిమాన్విత మహామౌని,
మస్తానయ దరగాగల
బస్తీయా గుంటూరే !

విద్యలందు, వైద్యమందు,
వివిధసంఘసేవలందు
కరుణామయు స్మరణసేయు
పురమాయెను గుంటూరే !

పునాదిలో రాళ్ళవోలె
కనిపింపరు శ్రమజీవులు,
కర్మయోగులగు వారికి
కాణాచియు గుంటూరే !

ప్రజలనాడి దెలిసికొన్న
పలుచిట్కా లెరిగియున్న
రాజకీయ భిషగ్వరుల
రచ్చపట్టు గుంటూరే !

అతిరథులకు, మహారథుల
కాలవాలమీ పురమని
దిగ్దిగంతకీర్తి గన్న
తెన్గుగడ్డ గుంటూరే !

రాష్ట్రకేంద్ర మంత్రులుగా,
ప్రభుత్వాధికారులుగా,
ప్రముఖులైన ఎందరికో
పాఠశాల గుంటూరే !

సామాజికరాజకీయ
చైతన్యము ప్రస్ఫుటించు
ఉద్యమాల కెన్నిటికో
ఉనికిపట్టు గుంటూరే !



ఘంటముతో మతసాంఘిక
కంటకాల గెంటునొడుపు
కవిబ్రహ్మ కడనెన్నడొ
కనుగొన్నది గుంటూరే !

సమసమాజ సిద్ధాంతపు
చాపకూటి పథకాలను
యుగయుగాల నాడె విన్న
జగావీడు గుంటూరే !

నవసమాజ నిర్మాతల
వివిధభావధోరణులను
వినిపించిన వివరించిన
ఘనవేదిక గుంటూరే!

చిరకాలపు భావదాస్య
శృంఖలాల ఛేదించిన
కవిరాజును తనపొర్వున
గల్గినదీ గుంటూరే !



కడజాతుల కడగండ్లను
కడుజాలిగా చిత్రించిన
నవయుగ కవిచక్రవర్తి
నివాసమ్ము గుంటూరే !

మనుజులందు
హృదయార్ద్రత
ఇనుమడింప కృతులల్లిన
కరుణశ్రీ కవిచంద్రుల
స్థిరవాసము గుంటూరే !



ఉన్నవ నవలాక్షణికులు,
మన్నన గల సంస్కర్తలు,
మహా మహోపాధ్యాయులు
మన్ననపురి గుంటూరే !

స్త్రీవిద్యావ్యాప్తి కొఱకు
శ్రీకారంబెపుడొ చుట్టి,
శారదకిదె నికేతమను
పేరుదాల్చె గుంటూరే !

రైతులకును, నేతలకును
జాతిజనుల కెల్లరకును
ఆచార్యులునగు పూజ్యుల
కాప్తనగరి గుంటూరే !

కర్షకోద్యమాల గాంచె
కార్మికోద్యమాల జూచె
హేతువాద సామ్యవాద
రీతులరసె గుంటూరే !

స్వాతంత్ర్యపు సమరానికి
సత్యాగ్రహవీరులుగా
తనపౌరుల నెందరినో
తరలించెను గుంటూరే !

ఆంధ్రజాతి రత్నమ్ముల
అరిభీకర నరసింహులు
ఆశయాల సాహసాల
ఆవాసము గుంటూరే !

పరపాలన నెదిరించుచు
పురపాలక సౌధముపై
మనజెండా నెగురవేసె
మునుముందుగ
గుంటూరే!

ఆనాటికి ఈనాటికి
అక్రమాల కెదురుతిరిగి
పోరాడెడు వీరవరుల
పురుటిగడ్డ గుంటూరే !

లోకహితమె లక్ష్యమైన
ఏ కార్యక్రమమందును
పూనికతో నెల్లప్పుడు
ముందున్నది గుంటూరే !

మహిమొత్తము కంపించిన
మహాయుద్ధకాలమందు
ఆంధ్రవిశ్వకళాశాల
కాశ్రయమిడె గుంటూరే!

రాష్ట్రోదయ ఘట్టమందు
రాజధాని రాకున్నను,
ఉన్నతమౌ న్యాయపీఠ
మున్నపేట గుంటూరే !

తెలుగునేల నేలుకొనగ
తెలుగువారు మేలుకొనగ
రాష్ట్రస్పృహ మొట్టమొదట
రగిలించెను గుంటూరే !

వీసమేని ఏసలేని
వినసొంపగు తెనుగుబాస
నలవోకగ తనగళమున
బలుకునదీ గుంటూరే !

తెనుగువాని కెవనికేని
తనసొంతమె యీ ప్రాంతము
అనిపించెడు ఆత్మీయత
నందించును గుంటూరే !

తెనుగువాని ఉత్సాహము,
తెనుగువాని ఉద్రేకము,
తెనుగువాని సర్వస్వము
తెలియుతావు గుంటూరే !

తెనుగమ్మల కట్టుబొట్టు,
తెనుగయ్యల నీటుగోటు,
తెనుగువారి తీరుతెన్ను
తెలుపుకుదురు గుంటూరే !

తెలుగునేల నుద్భవించు
వెలుగునీడలన్నింటికి
నిలువుటద్ద మైనట్టిది
నిక్కముగా గుంటూరే!

నవజీవన హేతువైన
నవభావన నేదైనను
తొలుదొల్తగ తెలుగునాట
వెలిగించును గుంటూరే !

క్రొత్తతరపు మోజులతో
క్రొత్తరకపు సొగసులతో
కనువిందుగ యువబృందము
కదలుచోటు గుంటూరే!

అధునాతన నాగరికత
కాలంబన మగుచుండియు,
తెనుగువిరులు పరిమళించు
జనవాటిక గుంటూరే !

ఆర్థికమగు నడవడితో
యాంత్రికముగ మనుచుండియు
తెనుగుసిరులు తుఅగలించు
గనిగడ్డయు గుంటూరే !

కవిగాయక నటనర్తక
వివిధ కళావేత్తలతో
నిత్యసభావేదికగా
నెగడొందును గుంటూరే!

గతకాలపు చమూపతుల,
కళాశాస్త్ర కృతికర్తల –
అటునొక్కని, ఇటు నొక్కని
అరసెనెపుడొ గుంటూరే !

నటలోకపు పితామహుల,
నాదకళా మహోదధుల,
కథాగాన కళానిధుల,
నిధానమ్ము గుంటూరే !

కళా జగజ్జేతలైన,
తెలుగునాటి నేతలైన,
చలనచిత్ర మహానటుల
తొలిరంగము గుంటూరే!

విశ్వ క్రీడాంగణమున
విజయోన్నతులందుకొన్న
అరిజిష్ణుల, వర్ధిష్ణుల
ఆటపట్టు గుంటూరే !

అవధాన కళోద్దండులు,
ఆశుకవీట్ ప్రకాండులును
రసవద్రణ మొనరించిన
రంగస్థలి గుంటూరే!

నవమనోజ్ఞభువనవిజయ
కవన గాన రూపకమ్ము
ప్రథమమ్మున రూపొందిన
ప్రతిభాస్థలి గుంటూరే !

కవికోకిల లాలపించు
నవవత్సర పర్వవేళ
ఘనవసంత నవమంటప
మనిపించును గుంటూరే!

ఇచటిగాలి సోకినచో
ఎవరైనను కవులౌదురు,
కళావేత్త లౌదురనెడు
ఖ్యాతిగలది గుంటూరే !

ఎట ప్రశంసలందినచో
ఎల్లచోట్ల నెగ్గినట్లె
అనియెంతురొ కళాకారు
లా స్థానము గుంటూరే !

సభ్యతగల శ్రోతలతో
సంస్కృతిగల వక్తలతో
సరసమైన సభల నెఱపు
పురవరమ్ము గుంటూరే !

చదువులమ్మ వెలసియున్న
సంస్థానము గుంటూరే !

పలుకులమ్మ గుడులనదగు
బడులున్నది గుంటూరే !

ప్రతిపిన్నయు విద్యార్థియె,
ప్రతిపెద్దయు ఆచార్యుడె,
ప్రతియిల్లును బడియే యన
ప్రథగొన్నది గుంటూరే !

పురమంతయు పాఠశాల,
పురమంతయు కళాశాల,
పురమంతయు విశ్వకళా
పరిషత్తన గుంటూరే !

తెలుగునుడులు నిల్చుదాక
తలపుతావు లిడునుగాక
నా కవనపు నవమాలిక
గైకొనుమోగర్తపురీ!

## కవి పరిచయము

కవి ధనేకుల వారి స్వగ్రామం తాడికొండ. 20-9-40న గుంటూరులో జన్మించారు. యస్.ఐ.వి.హైస్కూలు (తాడికొండ) ఏ.సి. కాలేజీ (గుంటూరు)లో విద్యాభ్యాసం చేశారు. కరుణశ్రీ, స్ఫూర్తిశ్రీలు వీరి కవితా గురువులు, తిక్కన, జాషువాలు వీరి పరోక్షగురువులు. విశ్వనాథ, చలం, బెజవాడ గోపాలరెడ్డి, ఎస్.వి. భుజంగ రాయశర్మ ఎలవర్తి రోసయ్య వంటి సాహితీవేత్తల నుండి అనేక ప్రశంసలు, ఆశీస్సులు అందుకొన్న రసవత్కవులు వీరు. కవనము, చిత్రలేఖనము, తత్వశాస్త్రము, యోగశాస్త్రము వీరి అభిమాన కళాశాస్త్రాలు. అలరాజు (నాటకం) కవిజీవిక (ఖండకావ్యం) సీతాకోకచిలుక (ద్విపదకవిత) నెమలిరేడు (గేయకవిత) ఆకుబూర (గేయకవిత) వీరి ఇతరకృతులు. వీరి ఈ ''గుంటూరు'' గేయ కవిత విశేష ప్రజాదరణ పొందినది.

సంపాదకుడు

ఆలోకం పెద్దబ్బయ్య B.Sc., B.Ed.

**ఆకుబూర (గేయకవిత)**ముద్రణ : సెప్టెంబర్, 2019



**ముందుమాట**

ధనేకుల వెంకటేశ్వరరావుగారు సహజకవి,చిత్రకారుడు.20-9-1940న గుంటూరు జిల్లా తాడికొండలో రామానుజయ్య-కనకమ్మ దంపతులకు జన్మించిన వీరు ఆంగ్ల భాషా సాహిత్యాలు ప్రధానాంశంగా కళాశాలలో కొన్నాళ్లు బి.ఏ. తరగతిలో చదివారు. 17వ ఏట తెలుగులో పద్యాలు వ్రాయటం ప్రారంభించారు. 28వ ఏట 'అలరాజు' అనే పద్య నాటకాన్ని అద్భుత పాత్ర చిత్రణతో రచించి, ఆనాటి సాహితీవేత్తల ప్రశంసల నందుకొన్నారు. 1977 లో 'కవిజీవిక' అనే ఖండకావ్యాన్ని, 'నెమలిఈడు' అనే గేయకవితను వ్రాశారు. గుంటూరును గురించి వీరు రాసిన గేయ కవిత మధుర గాయకులు ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యంగారి ద్వారా జగత్ప్రసిద్ధ మయింది. రవీంద్రుని గీతాంజలిలోని 'మాతృవందన' గీతాన్ని సీస పద్యంగా వ్రాయగా, ప్రార్థనా గీతంగా అనేక సభలలో పాడబడి ప్రశంసల నందుకొన్నది.

ధనేకులవారు ఇప్పుడు వెలువరిస్తున్న 'ఆకుబూర' గేయకవిత 1990లో 'దీప్తి' త్రైమాసిక పత్రికలో తొలుత ప్రకటించబడింది. ఇది అద్భుత కవితా ఖండిక. విద్వాన్ విశ్వంగారి 'తెన్నేటిపాట',

నాగభైరవగారి 'కన్నీటి గాథ' వంటి గేయ కావ్యాలు కథా ప్రధానమైనవి కాగా, ధనేకులవారి ఈ రచన అనుభూతి ప్రధానమైనది. 150 అశ్వగతి రగడ గేయాలలో సాగిన ఈ రచన సరస్వతికి సమర్పించిన నిర్ధూమ నీరాజనం. కవిత్వానికి పరిపూర్ణ నిర్వచనం.

కవి సంఘానికి ప్రతినిధి. సంఘ జీవనంలో తాదాత్మ్యం చెంది దాని పోకడలను, పరిణామాలను విశ్లేషించుకొని, ఆ అనుభూతులను తనవిగా చేసుకొని, వాటిని సాధారణ ప్రజలు ఊహించని విధంగా రమణీయ భావాలతో సుందర పదజాలంతో క్రొత్తదనంతో పాఠక హృదయాలను రంజింపజేసే విధంగా, కవితాత్మకంగా తీర్చిదిద్దుతాడు. అటువంటి కవిత అజరామరంగా నిలుస్తుంది. ఆ రచనా విధానం అనేకులకు ఆదర్శప్రాయ మౌతుంది. ధనేకులవారి ఆకుబూర ఈ కోవకు చెందినదే.

గ్రామాలలో నడిబొడ్డున రచ్చబండ వద్ద ఉండే పెద్ద చెట్టు చుట్టు తిరుగుతూ ప్రధానంగా ఈ రచన సాగుతుంది. పెద్దమ్రాను, చెట్టు చుట్టు, ఆకుబూర, గాలివాన అనే నాలుగు ఖండికలుగా ఇది విభజించబడింది.

ప్రారంభ గేయంతోనే కవిగారు పాఠకులకు 'ఆకుల ఆలయం, కొమ్మల కోవెల' అయిన ఆ చెట్టు నిలువెత్తు సాక్షాత్కారాన్ని కలిగిస్తారు.

'పుడమితల్లి గొడుగువోలె / ఎల్లవారి ఇల్లువోలె / ఊరికెల్ల పెద్ద తలగ / ఉండె వృక్షరాజ మొకటి.'

వృక్షరాజము అనటంతోనే దాని ఠీవి, ఔన్నత్యం, ఔదార్యం, ఆశ్రిత రక్షణం వంటి రాచగుణాలను స్ఫురింపజేశారు కవి. వాటిని అనంతర గేయాలలో విస్తరించి చూపారు. అలాగే అక్కడికి చేరేవారిని వివరించటంలో మానవుల వృత్తి, ప్రవృత్తులలోని వైవిధ్యాలను

అద్భుతంగా విప్పిచెప్పారు. ఏడాది పొడుగునా గ్రామస్తుల వివిధ కార్యకలాపాలకు, కళాప్రదర్శనలకు ఆ చెట్టు ఎలా వేదికగా ఉంటుందో ఆ రీతిని వివరించారు.

చెట్టు చుట్టు అన్న రెండవ భాగంలో ఆ చెట్టు పరిసరాల వర్ణన సాగింది. ఆ చెట్టు ప్రక్కన చెరువు, అక్కడికి నీటికోసం వచ్చే యువతులతో యువకులు విసిరే సరసోక్తులు, అక్కడి నాగమండపం, అట్లతద్ది ఊయలలు, దేవుని రథయాత్ర, ప్రభలు, అక్కడ సాగే రచ్చలు, తీర్పులు, పంచాంగ శ్రవణాలు, సభలు, సమావేశాలు, ఇంకా బ్రతుకు తెరువుకు అక్కడ చేరిన వివిధ వృత్తుల కళాకారులు, వ్యక్తుల చిత్తవృత్తులు మొదలైనవి హృదయంగమంగా, అనితర సాధ్యంగా వర్ణించబడ్డాయి.

ఆ చెట్టుకు, కవిగారికి ఉన్న ఆత్మీయానుబంధం, పిన్నవయసులో అక్కడ గడిపిన క్షణాల అనుభూతులు, అక్కడ ఏకతారను మీటే బైరాగి వైరాగ్యాన్ని, ఆ ఏకతారతో శ్రుతిగలుపుతూ తాను ఊదిన ఆకుబూరను మూడవ భాగంలో ముచ్చటగా వినిపించారు.

అంతటి వృక్షరాజం ప్రకృతి వైపరీత్యంతో తుపానుకు నేలకొరిగితే, మూల్గిన చెరువును, ముసిరిన జనులను, తల్లడిల్లిన హృదయాలను, ఏర్పడిన శూన్యతను హృదయానికి హత్తుకొనేలా చివరి భాగంలో వివరించారు కవి గారు.

ఈవిధంగా పెద్దమ్రాను జ్ఞాపకాల ఆకుబూరను పాఠకులకు వినిపించారు. కవి ధనేకుల.

కవిత్వ రచనకు వస్తువు ఎంత ప్రధానమో రూపం కూడా అంతే ప్రధానం. ఒక కవితా వస్తువు ఏ రూపంలో చెపితే దానికి పూర్తి న్యాయం జరుగుతుందో ఆ కవితా రూపాన్ని ఎన్నుకోవడంలోనే కవి

ప్రతిభ కనిపిస్తుంది. ధనేకులవారు ఆకుబూర రచనకు పాదానికి నాలుగు మూడు మాత్రల గణాలను కలిగిన హయప్రచార రగడను ఎన్నుకొన్నారు. ఈ రగడ పేరుకు తగినట్లు గుఱ్ఱంలా పరుగులు తీస్తుంది మంచి కవి చేతిలో పడితే. లేకుంటే కుంటి నడకలు నడుస్తుంటుంది. ధనేకులవారు దీనిని ధాటిగా నడిపించారు ఎక్కడా కుంటు పడకుండా. అలాగే ఆద్యంత ప్రాసలతో, తెలుగుదనపు పలుకుల రుచితో ఏకబిగిన చదివించే కవిత్వాన్ని సృష్టించారు తమ అద్భుత పద సంపదతో.

ఆ కవితా వైభవాన్ని గమనిద్దాం.

'ఎన్నొ వెతల నోర్చి ఓర్చి / దున్ని విత్తి కోసి నూర్చి / ధరణికెల్ల కూడు పెట్టు / ధార్మికుండు కర్షకుండు' అంటూ అల్పాక్షరాలలో అనల్ప భావాల నిమిడ్చి కర్షకుని నిర్వచించారు. అలాగే 'నీటి నొసగి దప్పి తీర్చు / నిండుగుండె తోడ చెరువు / నీడ నొసగి సేదదీర్చు / నెమ్మనమ్ముతోడ చెట్టు' అంటూ చెరువును, చెట్టును ప్రశంసించిన తీరు అద్భుతం. పాదాదిలో నకారాలు, నిండుగుండె, నెమ్మనమ్ము వంటి పదబంధాలతో కవితాశ్వం పరుగులు పెట్టడం పాఠకులు గమనించాలి. 'ముద్దబంతిపువ్వు వంటి / ముద్దుగుమ్మ పాడుచుండు / సన్నజాజి మొగ్గ వంటి / వన్నెలాడి ఆడు నచట' అన్న గేయంలో కూర్చుని పాడే స్త్రీని ముద్దబంతిగా, నిలబడి నాట్యం చేసే స్త్రీని సన్నజాజి మొగ్గగా వర్ణించడం అమోఘం.

'సత్యమనుచు ధర్మమనుచు / చాటుచుండు నచటి సభలు / భాగ్యమనుచు భోగ్యమనుచు / పరువెత్తును సంఘ మెపుడు', 'చెడ్డనైన మంచినైన / చేయుచుండు మానవుండు / పాపమేదొ పుణ్యమేదొ / పరికించును పరమాత్ముడు' వంటి శాశ్వత సత్యాలు, సిద్ధాంతాలు సులభ శైలిలో చెప్పడం గమనార్హం. 'అట్లతద్ది ఊయలెక్కి / అతివ

లూగుచుందు రచట / వ్రతములున్న పేరటాంఢ్రు / వాయనాలు పంతు రచట'; 'ఎడ్ల నాడ వేయువారు / గొర్ల మందు పోయువారు / మాటువెట్టు కొలిమివారు / మ్రాని చుట్టు మనుచుందురు' అనటంలో ఒకనాటి గ్రామీణ జీవన విధాన పరిశీలన ప్రతిఫలిస్తుంది. 'అననేర్చిన తగవు రాదు / తిననేర్చిన తెగులు రాదు / నోరు కుదరనట్టివారు / పోరువెట్టుకొందు రచట' వంటి సూక్తులు మనస్సుకు హత్తుకుంటాయి. స్వీయ అనుభవాలు ఎన్నో మూడో భాగంలో చదువుతున్నప్పుడు వారి సమకాలిక పాఠకులకు తమ చిన్ననాటి స్మృతులు తలపుకు వచ్చి ఆనందం అర్ణవమవుతుంది.

ధనేకులవారిది అద్భుతమైన భావుకత. 'చెట్టు మ్రోడువారునేని / చెరువు. గుండె దిగులుపడును / చెరువె ఎండిపోవునేని / చెట్టు మనసు కలతపడును', 'తప్పులేనివానిపైన / దండనమ్ము పడినప్పుడు / మ్రాను పైకి అనదుగాని / లోన మిగులు నొచ్చుకొనును', 'అనుగుచుట్టమైన చెట్టు / అతి దారుణ గతినొందగ / నీరంతయు కన్నీరుగ / నిండుచెరువు పొర్లి ఏడ్చె' అన్న గేయాలు చదివినపుడు పాఠకుని హృదయం ద్రవిస్తుంది.

'పచ్చలందు కెంపులట్లు / ముచ్చటైన మ్రాని పండ్లు / చాల చాల మెచ్చినాము /నేలరాలగొట్టినాము' అన్న గేయం పాఠకులకు ఆహా పుట్టిస్తుంది. 'అచటి సంఘజీవనమ్ము / అచటి దృశ్య వైభవమ్ము / చెట్టుతోనే చెల్లిపోయె / వట్టి బయలు మిగిలిపోయె' ఒక దీర్ఘ నిశ్వాసాన్ని కలిగించే ముగింపు కవిత ఇది.

ఇలా ధనేకులవారి ఆకుబూర విస్తృతిలో చిన్నదైనా ఒక మహాకావ్యాన్ని చదివి ముగించిన అనుభూతిని సహృదయుడైన పాఠకునకు కలిగిస్తుంది. ఒక సజీవ చిత్రాన్ని మన కళ్ల ముందు త్రిప్పుతుంది. గేయ సాహిత్యంలో ఒక మణిపూసగా నిలుస్తుంది.

తెలుగు పల్లెల గతకాలపు వైభవానికి మసిబారని అద్దంగా, నేటి తరానికి ఒక తీపి గుర్తయి, రేపటి తరానికి ఒక ఆశ్చర్యాను భూతిని కలిగిస్తుంది.

ఇటువంటి రచన చేసిన 'మాత్రాఛందస్సుల మహారాట్' కు హృత్పూర్వక అభినందనలు.

-సూర్యదేవర రవికుమార్

గుంటూరు

20-8-2019

# ఆకుబూర

## 1. పెద్దమ్రాను

పుడమితల్లి గొడుగువోలె,
ఎల్లవారి యిల్లువోలె,
ఊరికెల్ల పెద్దతలగ,
ఉండె వృక్ష రాజమొకటి!

అది ఆకుల ఆలయమ్ము,
అది కొమ్మల పెనుకోవెల,
అటకల్గును అనుభూతిగ
అంతరంగ సుప్రశాంతి!

అదియె జ్ఞానపీఠమగుచు
అట వెల్గులు ప్రసరించును!
అదియె న్యాయసభగ మెలగి
అట తీర్పుల ప్రకటించును!

అదె అపారవిపణికరణి,
అదె ప్రచారకేంద్రసరణి,
విక్రయక్రయాలు సల్పు,
వివిధ వార్తలెన్నొ తెల్పు!

అచట విడిదిసేయువారి
కది విచిత్ర పాంథశాల!
అచట చదువ నేర్చువారి
కది విశాల పాఠశాల!

అరసి మెచ్చు వారికెల్ల
అది వినోద మండపమ్ము!
అలసివచ్చు వారికెల్ల
అది విరామ మందిరమ్ము!

హర్షమొసగు కళలకెల్ల
అది ప్రదర్శనాలయమ్ము!
అనదలైన వారికెల్ల
అదె ఒక శరణాలయమ్ము!

పిట్టలెన్నొ గూండ్లు కట్టి
చెట్టుమీద కాపురించు!
మండుటెండ గొడ్డుగోద
మ్రాని నీడ నాశ్రయించు!

ప్రొద్దుపొడుపు నుండి అటకు
ప్రొద్దుకుంకునంత వఱకు
ఊరిలోని జనులెందరొ
ఊసుపోక కరుదెంతురు!

వివిధ మనసులున్నవారు,
వివిధ వయసులున్నవారు,
వివిధ వృత్తులున్నవారు,
వృక్షము కడ కన్పింతురు!

ఆటలొసగు ఆనందము
అన్యమందు పొసగదేమొ?
వీలుకూడినప్పుడెల్ల
బాలురాడుకొందురచట!

శృంగారపు గాథలెన్నొ
పొంగారగ నొడవికొనుచు,
గడుసుదనపు పడుచువాండ్రు
కడు సంబరపడుదురచట!

అనుభవాల జ్ఞాపకాలు
మనసునిండ ముసురుచుండ,
వయసు ముదియుచున్నవారు
వచ్చి విశ్రమింతురచట!

జీవితమున నోడిపోయి,
చిత్తశాంతి కోలుపోయి,
మతులు చెడిన బడుగువాండ్రు
వెతలనెల్ల మఱతురచట!

అలిగి నెలవు వీడువారు,
నిలువ నీడ లేనివారు,
పనిపాటలు లేనివారు,
వ్రాలుచుందు రచ్చటనే!

అన్ని అమరియున్నవారు,
ఆటుపోటు లేనివారు,
అప్పుడపుడు వాహ్యాళిగ
అచ్చోటనె విహరింతురు!

బడలియున్న బాటసారి,
వడలియున్న పసికాపరి,
అదవదైన ప్రతి బికారి,
అచట సేదదీఱువారె!

ప్రజకు నచ్చు ఖాద్యమేదొ,
పనికివచ్చు వస్తువేదొ,
అమ్ముకొనుచు బ్రతుకువారు
అచట సంచరించువారె!

వివిధవర్ణ కుసుమాలను
విక్రయించు నెఱజాణలు!
అచట వీచు తెమ్మెరలకు
అడ్డుచుంద్రు పరిమళాలు!

చిఱుత వస్తుచయమెకాక,
స్థిర చరాస్తులంతదాక
అమ్మకాలు కొనుగోళ్ళను,
క్రమ్మునటనె చెట్టుకడనె!

అప్పులిచ్చుచుండువారు,
అర్వు బుచ్చుకొనెడివారు,
వెదకుచుందు రొకరినొకరు
ఎదురౌదురు తరువు క్రింద!

జాతి జీవకళను చాటు
చేతివృత్తి పనులవారు -
వారి సృష్టి విల్చుకొనగ
వత్తురటకె తెత్తురటకె!

కష్టజీవి కర్మయోగి,
కళాదీక్ష పూనినపుడు -
వడిగ నిడును ముడిసరకులె
పలురకాల పరికరాలు!

పైరుపంట దక్కినపుడు,
తీఱుబాటు చిక్కినపుడు,
చెట్టుక్రింద ముచ్చటింప
చేరుచుంద్రు సేద్యగాంద్రు!

ఎన్నో వెతలనోర్చి ఓర్చి,
దున్ని, విత్తి, కోసి, నూర్చి,
ధరణికెల్ల కూడువెట్టు
ధార్మికుండు కర్షకుండె!

కర్షకులకు, కార్మికులకు,
క్ష్మాజముకడ సర్వులకును -
వేడ్కసేయ డాయుచుంద్రు
వివిధ కళల వెల్గువారు!

చిత్రకారు డొకడు వచ్చి
చిత్రాలను గీయునచట!
గాయకుండు ఒకడు వచ్చి
గేయాలను పాడునచట!

పిల్లగ్రోవి నొకడు దాల్చి
ఉల్లమలర నూదునచట!
చిఱుసొనాయి నొకడు పూని
స్వరమాధురి నింపునచట!

కానిపించు వాని గూర్చి,
కానరాని వాని గూర్చి
ఆశుకవిత లాలపించు
దేశికవియు తిరుగునచట!

ముద్దబంతి పువ్వువంటి
ముద్దుగుమ్మ పాడుచుండ,
సన్నజాజి మొగ్గవంటి
వన్నెలాడి ఆడునచట!

అప్పుడపుడు మానిక్రింద
ఆడుచుంద్రు నాటకాలు!
ఎప్పుడేని చెట్టుచెంత
చెప్పుచుంద్రు బుర్రకతలు!

పైరగాలి వీచునటుల
పాడునొకడు ఈలపాట!
పలుగొంతుల దాల్చినటుల
పలుకు స్వరములెన్నో!

హరికథలు పురాణములును,
తెఱపిలేక సాగునచట!
చెక్కభజన, కోలాటము,
మిక్కుటముగ మ్రోగునచట!

పెనుబర్వులు నెత్తువారు,
విలువిద్దెను జూపువారు,
కర్రసాము సేయువారు,
కడుముదమ్ము గూర్తురచట!

పిచ్చుకుంట్ల వీరగాథ
పెచ్చరిల్లుచుండునచట!
అచ్చపు పులివేసగాంద్రు
రెచ్చి దూకుచుందురచట!

అటకె ఆటకోతివాడు,
అటకె గంగిరెద్దువాడు,
అటకె బుడబుక్కలవాడు,
అరుదెంతురు మురిపింతురు!

అటనె డప్పుమ్రోత నొక్క
డనుసరించి చిందువేయు!
అటనె డక్క వ్రేతనొక్క
డతిగమించి సుద్దులాడు!

అటనె తోలుబొమ్మలాంద్రొ,
అటనె దొమ్మరాటగాంద్రొ,
అటనె పగటివేషగాంద్రొ,
ఆహ్లాదము నొనరింతురు!

భయముగొల్పు పాములాడొ,
భ్రమల నిల్పు గారడీడొ,
అచటి ప్రేక్షకాళినెల్ల
అచ్చెరువున ముంచువారె!

జీవనౌషధమ్ము వంటి
ఏ వినోదమో ఒనర్చి,
కను వీనులవిందు గూర్చు
కళాకారు లుందురచట!

ఊరులేని, పేరులేని,
ఒక్కచోట ఉనికిలేని,
కడుపునిండ కూడులేని,
కళాకారు లుందురచట!

జన్మతోడ అబ్బియున్న
సహజకళల కుబ్బిపోని -
కానరాని, పైకిరాని,
కళాకారు లుందురచట!

మట్టిలోని మానికముల
మాడ్కినున్న వీరెవ్వరు?
కల్మి, కీర్తి, పదవులున్న
కళానిధులు వారెవ్వరు?

తలచి తలచి చూచుకొన్న
తక్కువెవరు? ఎక్కువెవరు?
విశ్వవిభుని కొల్వులోన
వీరు వారు పనివారలె!

వృత్తి ఏదియైనగాని,
విధుల నెవడు విడనివాడె
సత్క్రమముగ సాగుచుండు
సంఘశకటమాగకుండ!

## 2. చెట్టు చుట్టు

కవనోహలు గల్గువారు,
నవభావన లున్నవారు,
చెట్టు నరసి, చెట్టు చాటు
చెర్వు నరసి, వర్ణింతురు!

నీటినొసగి దప్పిదీర్చు
నిండుగుండెతోడ చెరువు!
నీడ నొసగి సేదదీర్చు
నెమ్మనమ్ముతోడ చెట్టు!

చెట్టు మ్రోడువారునేని
చెరువుగుండె దిగులుపడును!
చెరు ఎండిపోవునేని
చెట్టుమనసు కలతపడును!

చెట్టు ప్రక్క దారి నుండి
చెరువు నీళ్ళ రేవు కడకు -
ఒయారముగ కడవలూని
యువతీమణు లేతెంతురు!

కోర్కెలూరు చూపులతో,
కోడెకారు కుర్రవాండ్రు
బ్రదుకులోని తీయదనము
వెదకికొంచు వత్తురటకు!

వలపు తలపొ చిలిపిపలుకొ
అలవోకగ వెలువరించి
ఆఅడి పడుచుందురచట
హద్దు మీరు ఆత్రగాండ్రు!

అరసైగలు, చిరునవ్వులు,
సరసోక్తులు, సాగునచట!
విరసోక్తులు విదులింపులు
పెడతిట్లును రేగునచట!

చెలగి తెప్పల తిరునాళ్ళు
చెరువులోన జరుగునపుడు
ఆకులెల్ల కనులుకాగ
అరసి మురిసిపోవు చెట్టు!

విశ్వసంస్కృతి వెలుగొందు
వృక్ష ప్రాంగణమ్మునందు -
ప్రజాజీవనమ్ము కూడ
ప్రబలు పచ్చదనముతోడ!

అపుడె పెండ్లియైన జంట
అచటి కేగుదెంచునపుడు,
అంత దవ్వునందె కాంచి
ఆశిషమ్ము లొసగు శాఖి!

అది ఉగాది యౌనుగాక,
అది సంక్రాంతి యగుగాక,
ఏయే పండగ వచ్చునో
ఆయా వేడ్కను దెచ్చును!

అందమైన కట్టడమ్ము
అచటి నాగమండపమ్ము!
ఏరువాక పబ్బమునకు
చేరునటకు అరకలెన్నో!

అట్లతద్దె ఊయలెక్కి
అతివ లూగుచుందురచట!
వ్రతములున్న పేరటాండ్రు
వాయనాలు పంతురచట!

ఉత్సవాలు, పూజలేవొ,
ఉర్వీజము గమనించును!
గుడి తిరునాళ్ళకు వెల్వడు
కొలుపులెల్ల తిలకించును!

స్వామివారి రథము కూడ
వచ్చి వచ్చి అచట ఆగి,
పెద్దని యొద్ద జేయు
కొద్దిసేపు మౌనగోష్ఠి!

శివుని గుళ్ళ కేగుచున్న
చిత్రచిత్ర ప్రభలబండ్లు
దరువులతో, భజనలతో,
తరుపు నొరసి తరలుచుందు!

పూజలైన, భజనలైన,
పుణ్యజపతపమ్ములైన -
ఒక్కచోట మానసమ్ము
నుంచుకొఱకె తెఱగులెల్ల!

వెఱ్ఱిపూనకాల వారు,
పిచ్చినమ్మకాల వారు,
మౌలికమగు తత్త్వమెల్ల
మఱచిపోయి ఎగురువారె!

పచ్చనైన రచ్చమాను
పల్వు రరుగుదెంచు చోటు
జరుగుచున్న చరితలెన్నొ!
చర్చ కొఱకు దరియు తావు!

అననేర్చిన తగవు రాదు.
తిననేర్చిన తెగులు రాదు,
నోరు కుదరనట్టివారు
పోరువెట్టుకొందు రచట!

అది వినోదమైనగాని,
అది వివాదమైనగాని,
తన నీడనె కొనసాగగ
తరువుండును సమదర్శిగ!

ప్రజాధర్మపీఠమైన
రచ్చమాని కొల్వులోన
నేరాలకు తగుశిక్షలు
తీరుపల్లె విధియింతురు!

తప్పులేనివానిపైన
దండనమ్ము పడినప్పుడు,
మాను పైకి అనదు కాని
లోన మిగుల నొచ్చుకొనును!

ఊరినడిమి మ్రానికడకు
చేరి యొక్క పురోహితుడు
వత్సరాది పర్వవేళ
పంచాంగము వినిపించును!

దిక్కులేని దీనులన్న
మక్కువెంతొ యున్నవారు
ఉన్నవారు ఆచరింతు
రన్నవస్త్ర దానమచట!

చేతిలోని గీతలరసి
జాతకాలు చెప్పువారు
ఆసలెన్నొ శ్రోతలందు
మోసులెత్త జేతురచట!

ఎడ్లనాడ వేయువారొ,
గొడ్లమందు పోయువారొ,
మాటువెట్టు కొలిమివారో,
మ్రాని చుట్టు మనుచుందురు!

ఎట్టి మొండి జబ్బునైన
ఇట్టె నెట్టివైతనుంచు
వివిధ మూలికాదులమ్ము
వింత వైద్యులుందు రచట!

అంటువ్యాధు లంటకుండ
ఔషధాల నందజేయు
వైద్యబృంద మొకటి వచ్చి
బససేయును చెట్టుక్రింద!

సంఘసేవ చేయుకొఱకొ,
సాటి ప్రజకు నేర్పుకొఱకొ,
శిబిరాలను నిర్వహింత్రు
చెట్టు చుట్టు బాలభటులు!

సాంఘికోద్యమమ్ము లెన్నొ
సాగుచుండు చెట్టు చెంత!
వివిధ మత మహాసభలును
వెలయుచుండు మ్రానిపొంత!

సత్యమనుచు, ధర్మమనుచు,
చాటుచుండు నచటిసభలు!
భాగ్యమనుచు, భోగ్యమనుచు,
పరువెత్తును సంఘమెపుడు!

చెడ్డనైన, మంచినైన,
చేయుచుండు మానవుండు!
పాపమేదొ పుణ్యమేదొ
పరికించును పరమాత్ముడు!

జరుగనున్న ఎన్నికలకు
సర్వపక్ష నాయకులును
జనుల నుద్ధరించునటుల
సభలు వెట్టుచుందురచట!

జూదగాడు, మోసగాడు,
త్రాగుబోతు, వదరుబోతు,
జేబుదొంగ, కూనికోర్లు,
దాపురింతు రచటకూడ!

కల్లనవ్వు నవ్వువాడు,
కుళ్ళుకూత కూయువాడు,
ముళ్ళచూపు చూచువాడు,
చెల్లుచుందు రచటకూడ!

వట్టి బురద చల్లువాడు,
కట్టుకతలు అల్లువాడు,
జుట్టు ముళ్ళు పెట్టువాడు,
తట్టుచుందు రచటకూడ!

కొంపలార్పు పెద్దమనిషి,
గొంతుకోయు సాదుపలవ,
మైదుసేయు మాటకారి,
మసలుచుందు రచటకూడ!

ఒకరినొకరు మోసగించు
చుండువారు నుందురచట!
తనను తానె మోసగించు
కొనెడువాడు నుండునటనె!

బ్రతుక నేర్వలేనివారు
పలుచిక్కుల బడుచుందురు!
బ్రతుక నేర్చుకొన్నవారు
పలుపోకల పోదురచట!

ఉన్నవాడు, లేనివాడు,
మంచివాడు, చెడ్డవాడు,
శ్రమజీవియు, సోమరియును,
తారసిల్లుచుందు రచట!

నవ్వులతో, ఏడ్పులతో,
నెయ్యముతో, కయ్యముతో,
పలురంగుల సాగుచుండు
సంఘ చలనచిత్ర మచట!

ఆటలతో, పాటలతో,
మాటలతో, మౌనముతో,
బహుభంగుల ఏగుచుండు
సంఘ చలనచిత్ర మచట!

ఆకటితో, చీకటితో,
ఆధులతో, వ్యాధులతో,
కటుగాథల జూపుచుండు
సంఘ చలనచిత్ర మచట!

స్వరసహస్ర మేళనమగు
జనజీవన బృందగీతి -
ఆలకించు నహరహమ్ము
ఆమహామహీరుహమ్ము!

## 3. ఆకుబూర

పెద్దకు నీడలోన
పిన్ననాడె మాకు గల్గె!
వివిధ భావనాత్మకమ్ము,
విశ్వరూప దర్శనమ్ము!

అనుగు చెల్మికాండ్ర మెల్ల
ఆడుకొనుచు పాడుకొనుచు,
చిన్ననాటి రోజులెన్నొ
చెట్టుచుట్టు గడిపినాము!

తీయనైన, పుల్లనైన,
తిండ్లుగాని, పండ్లుగాని –
అటకుతెచ్చి పంచుకొనుచు
ఆరగించినాము మేము!

కాగితమున జేసినాము
గాలిపడగ, నీటిపడవ!
మట్టినుండి మలచినాము
మనిషిబొమ్మ వేల్పుబొమ్మ!

బంతియాట, బిళ్ళగోళ్ళు,
బలిగుడాట, బొంగరాలు,

కోతికొమ్మ, గోలికాయ -
కూడి ఆడుకొంటి మచట!

పులిజూదము, చదరంగము,
అలదాడియు ఆడినాము!
ఎత్తులేయు మాయగాండ్ర
చిత్తుజేయ నేర్చినాము!

ఆటలందు తొండిసేసి,
అడపదడప కీచులాడి,
అంతలోనె మరచిపోయి
అత్తుకొనుచు మెలగినాము!

మ్రాని చుట్టు ఎగురుచుండు
తూనీగల బట్టినాము!
నేరమంచు నేరకుండ
దారాలకు గట్టినాము!

పచ్చలందు కెంపులట్లు
ముచ్చటైన మ్రానిపండ్లు!
చాల, చాల, మెచ్చినాము
నేలరాల గొట్టినాము!

సెగలు గ్రక్కు గ్రీష్మమందు
చెట్టుక్రింది చలివేంద్రనె
పొట్టనింద దప్పినీళ్ళు
జట్టుకట్టి త్రా వినాము!

కొంతకొంత మందిలోని
వింత వింత తీరులెన్నొ
అనుకరించి కొక్కిరించి
హాస్యమెంతొ మినికినాము!

పెద్దలకడ విన్నవేవొ
పిట్టకథలు చెప్పుకొనుచు,
పొడుపుకథలు విప్పుకొనుచు
ప్రొద్దుపుచ్చుకొంటి మచట!

అటనె చెట్టు బోదెమీద
అక్కరముల జెక్కినాము!
సీమసుద్ద, బొగ్గునద్ది,
చిత్తరువులు దిద్దినాము!

అట ఉగాది మాకు పంచె
ఆరురుచుల ప్రసాదమ్ము!
ఒసగె రామనవమి వచ్చి
పెసరపప్పు, పానకమ్ము!

అప్పుడప్పు డచట దొరకు
పప్పుబెల్ల మందు కొఱకు -
పలకబలప మవలవిసరి
పర్వులెన్నొ పెట్టినాము!

శ్రీ గణేశు చవితినాడు
సేకరించినాము పత్రి!
విజయదశమి విల్లులూని
విసరినాము రంగుపొడులు!

చెట్టుక్రింది క్రీడలందె
అట్టి కాలమెంతొ నెట్టి
వేళతప్పి బడికిచేరి
బెత్తపురుచి చూచినాము!

దీపావళి దివ్వెటీలు
దిట్టముగా త్రిప్పినాము!
సంక్రాంతికి చూచినాము
సందడిగా కోళ్ళపోరు!

జాతియెల్ల సంతసిల్లు
స్వాతంత్ర్య దినోత్సవాన
ముదిచెట్టున గట్టినాము
మువ్వన్నెల జెండాలను!

తిరునాళ్ళకు హంగుదెచ్చు
నెరరంగులరాట్న మెక్కి,
వేడ్కతీర, వెఱపుమీఱ,
వేగిరముగ తిరిగినాము!

చింతలేని, వంతలేని,
చిత్తమందు కల్లలేని,
బాల్యమిపుడు మఱపురాదు!
బ్రతుకునందు మరలిరాదు!

అతడెవ్వరొ ఒక విరాగి
అవనిజాంఘ్రినిలయ యోగి
తంబురాను మీటుకొనుచు,
తత్త్వమేదొ పాడుకొనును!

ఎల్లవేళలందు నొకడె
తల్లియొడిని పిల్లడటుల-
మొదలు నొద్దనుండు నతని
కదియెసత్ర మదియెమఠము!

ఎప్పుడతడు ఏమి తినునొ
ఎవరుగాని చూడలేదు!
ఎవ్వరైన ఇచ్చుచున్న
ఏదిగాని పుచ్చుకొనడు!

వెలుగునుండి, గాలినుండి,
విశ్వవిభుని ప్రేమనుండి –
భక్తిభావ యోగమందు
భుక్తినతడు పొందునేమొ?

గొంతువిప్పి, గుండెవిప్పి,
ఆత్మనాదమతడు సేయ-
రాళ్ళుకరగు మ్రోళ్ళుపూచు
ప్రకృతియెల్ల పరవశించు!

నాల్గునాళ్ళ నాటకమౌ
బ్రతుకునందు రక్తి లేక
భక్తితోడ ముక్తి కొఱకు
పాడుచుండును బైరాగి!

'చెదరిపోవు బ్రదుకులందు
మమతలేల మనుజులార!
ఆలకింపుడాత్మ' ననుచు
ఆలపించు ఆ విరాగి!

ఇష్టమైన, కష్టమైన,
ఏదిగాని హృదిని లేక -
ఆత్మలోనె లీనమౌచు
ఆనందమునందు నతడు!

ధ్యానముద్ర నొకటి వేసి,
ఆత్మచింతనమ్ము చేసి,
లోని భ్రమలనెల్ల ద్రోసి,
జ్ఞానసిద్ధి గాంచె నతడు!

'బాహ్యభ్రాంతి వీడవలయు,
భావకాంతి జూడవలయు'!
అనుచునెంతు మతనిచెంత
ఆత్మదర్శనాభిలాష!

ఒక్కనాడు ఆ విరాగి
ఏకతార మీటుచుండ –
ఆగలేక మేము కూడ
ఆకుబూర లూదినాము!

'పిప్పిపీపి, పిప్పిపీపి'
యనుచు గంతులేసికొనుచు -
ఆకతాయి మూకలమై
ఆకుబూర లూదినాము!

బూరలట్లె ఊది ఊది
బోరుగొల్పు మమ్ము జూచి,
ఆత్మగీతినాపి యోగి
అతిమనోజ్ఞరీతి నవ్వె!

'అయ్యలార! ఊదుకొండు
ఆపకుండ' అనియె నతడు!
బిడియపడుచు అపుడు మేము
వెట్టిపర్వులెత్తినాము!

## 4. గాలివాన

ఏ యుగోదయమునందొ
ఇంత బీజ మంకురించి,
అనుదినమ్ము పెరిగి పెరిగి
పెనుమ్రానుగ విస్తరించె!

అణువునందు బ్రహ్మాండము
ఆవిర్భావమొందు గతి –
చీమతలను మించనట్టి
చిన్నగింజ నెగసె చెట్టు!

రమ్యహరిత హర్మ్యరీతి
గ్రామ మధ్యమందు చెట్టు
చైతన్యస్ఫూర్తి నొసగు
జనజీవన కేంద్రమయ్యె!

కాలమాంత్రికుండు పన్ను
గారడీల కగ్గమగుచు,
వివిధ ఋతువులందు తాను
వివిధ గతులనొందె మ్రాను!

పగలంతయు రాజయోగి
పగిది కానిపించు చెట్టు!
రేల ధ్యానమగ్నమౌని
లీల గోచరించుచుండు!

ఒక్క కాలరాత్రివేళ -
ఉరుములతో, మెరుపులతో,
ఊపులతో, తాపులతో,
ఉద్భవించే ఉగ్రఝంఝ!

దుష్టచేష్టలెన్నొ సేయు
దుండగీంద్ర దండువోలె –
ఘోరచర్యలెన్నొ నెఱపె
క్రూరమైన గాలివాన!

రేగి, రేగి, చెడుతుపాను
వృద్ధవిటపి నూపివైచె!
ఊగి, ఊగి, పెద్దమ్రాను
ఉర్విమీద కూలిపడియె!

అటుల త్రెళ్ళు ధాత్రిజమ్ము
ఆర్తనాదమొందు చేసె!
తీవ్ర ఫెళ ఫెళారవమ్ము
దిక్కులదర మాఱుమ్రోసె!

ప్రళయధాటి జరిపి, జరిపి,
ప్రబలవృష్టి ఆగిపోయె!
వృక్షపతన మరసి, అరసి,
విశ్వసృష్టి మూగవోయె!

బహుళ వత్సరాలనాటి
ప్రకృతి వైభవాంశమొకటి
ప్రకృతి వైపరీత్యమందు
పడసెనట్లు తనముగింపు!

జానపదుల చేతనమును
జాగరితం బొనరించిన
తరురాజము పడిపోయెను!
గురుపీఠము విడిపోయెను!

అనుగు చుట్టమైన చెట్టు
అతిదారుణ గతినొందగ
నీరంతయు కన్నీరుగ
నిండుచెర్వు పొర్లి యేడ్చె!

కట్టలు తెగగొట్టుకొనుచు,
బిట్టుపొంగు అశ్రులతో -
జాలిగొల్పు మూల్గులతో -
జలాశయము విలపించెను!

వృక్షలోక శేఖరమ్ము
ఇంక కానరాదటంచు
గండిపడిన గుండెతోడ
ఘనతటాకము రోదించె

పెద్దమ్రాను కూలె ననుచు,
వీరు వారు చెప్పుకొనుచు,
ఊరిజనులు గుంపులుగా
చేరుకొనిరి చెట్టుదరికి!

మ్రానుపడిన తీరుచూచి
మ్రాన్పడెను ప్రజాళియెల్ల!
ఆ విషాదదృశ్య మెంచి
అలమటించె గ్రామమెల్ల!

గాలివాన కిండ్ల చేల
చాల నష్టపడిరి కాని,
అంతకన్న చెట్టుపాటు
కెంతొ కష్టపడిరి ప్రజలు!

తలపండిన పెద్దవారు,
ధర్మచింతన గలవారు
చెమ్మగిలిన కనుదోయికి
చెట్టువ్రేళ్ళ నద్దుకొనిరి!

ఆప్తబంధు వస్తమింప
ఐనవారు వగచుమాడ్కి
తరువరమ్ము కూలిపోవ
తల్లడిల్లి రెల్లవారు!

అచటి సంఘజీవనమ్ము,
అచటి దృశ్యవైభవమ్ము,
చెట్టుతోనె చెల్లిపోయె!
వట్టి బయలు మిగిలిపోయె!

తనచల్లని నీడలోన,
తనపచ్చని నెలవులోన,
ఆశ్రయించు వారినెల్ల
ఆదరించె పాదపమ్ము!

అద్దిజరుగు నిద్దిదొరకు
పెద్దమ్రాని యొద్దనను
చాటునట్టి కేకలెల్ల
నాటినుండి సమసిపోయె!

తరతరాల గ్రామచరిత
తరువుచెంత చాలజరిగె!
మంచిచెడుల కెన్నిటికో
మౌనసాక్షి యయ్యె మ్రాను!

భావశాఖ లెన్నొ సాచి
ఆవరించె స్మృతిని ద్రుమము!
కైత నూదికొంటి నిపుడు
జ్ఞాపకాలఆకుబూర!

## తత్త్వచింతన

ప్రాణమున్నపుడీ
శిరమ్ములో మున్ను
ఆలోచనములెన్ని
అలముకొన్నవి!
ఎన్నెన్ని ఈహ లెన్నెన్ని ఊహలును
పాపపుణ్యాలకై
ప్రభవించినవియొ!
లోనితలపులకు పైని ప్రకటన
లెన్ని యీ మోముపయిన్
సాగినవియొ!
ఇప్పుడా భావమ్ము
లెటకేగినవియొ?
ఇప్పుడా హావమ్ము లెట దాగినవి?
కోపతాపములెందు
కూలిపోయినవొ?
మోదభేదములెందు
మునిగిపోయినవొ?
పనిమాని పడియున్న
పంచేంద్రియములు
తమతమ విధులను
తలపోయవిపుడు!

మానసాచలములే
మరణంబునెదుట
మట్టిబుజ్జులు కాక మానునే
తుదకు?
మహినెల్ల పాలించు
మకుటమ్ముకూడ
దాని రోజునకదే ధాత్రిలో కలియు
జీవించునన్నాళ్ళు జేనెడుపొట్ట!
జీవమూడిన నాడు చేరెడునేల!
ఈ మట్టిబొమ్మల కీ మూడునాళ్ల
బ్రతుకుల కిన్నిన్ని
బదవలెందులకొ?

* *

పుడమితల్లిరో! నీపైన పుట్టిపెరి
జీవనక్రీడ చాలించు జీవులెల్ల
తిరిగిలేవని పెద్దనిద్దురను మునిగి
వ్రాలెదరు నీదు
గర్భతల్పమ్మునందు!

## ప్రార్థన

ఎచ్చోట మానస మెట్టి జంకును లేక
శిరమెత్తుకొని నివసింపగలదొ,
ఎచ్చోట విజ్ఞాన మెట్టి ఆంక్షయు లేక
ఎల్లవారికి లభియింపగలదొ,
ఎచ్చోట నరజాతి ఏకకుటుంబమై
హృదయాలు విప్పి భాషింపగలదో,
ఎచ్చోట పరిపూర్ణవృద్ధికై, సిద్ధికై
కృషి నిరంతరము రహింపగలదొ,
ఎచ్చోట ధీఝరి మృతభావమరువులో
ఇంకిపోవక ప్రవహింపగలదొ,

అరయ నెచ్చోట నీ శిక్షణాశ్రయముల
ఎల్ల భావక్రియలును వర్తింపగలవొ
ఆ మహామహోదయదశ నందుకొనగ
దేశమును నడిపింపుమో ! దేవదేవ !!

(శ్రీభారతీయ మార్గం - ఆగస్టు, 2007)

ఎక్కడ చిత్తము ఏమియు జంకక
ఎత్తిన తలతో జీవించునో
ఎక్కడ జ్ఞానము ఎల్లరి వెలుగై
ఎవ్వరికైనను లభియించునా
ఎక్కడ తలపులు సువిశాలములై
ఎల్లెడ ఐక్యము వెలయించునా
ఎక్కడ వాక్కులు గుండెలనుండియె
ఇంపుగ సొంపుగ వినిపించునా
ఎక్కడ క్రియలకు పరిపూర్ణత్వము
కృషియోగమ్మున సిద్ధించునా
ఎక్కడ ప్రతిభలు నవనవపథములు
పెక్కగు విధములు వికసించునొ
ఎక్కడ నీ కృప మతులను తిన్నగ
కృతులను మిన్నగ నడిపించునా
ఆ దివ్యమ్మగు ముక్తిపదానికె
నా దేశమును జేర్చుము దేవా ! (2007

# ప్రార్థన

చిత్తమెచట నిర్భయముగ
శీర్షమెత్తి జీవించునో,
జ్ఞానమెచట భాసురముగ
సర్వదిశల ప్రసరించునో,
తలపులెచట భవ్యములై
ఇల ఐక్యము వెలయించునో,
పలుకులెచట స్వచ్ఛములై
వెలికి వచ్చి అలరించునో,
పనులకెచట కృషిఫలముగ
పరిపూర్ణత సిద్ధించునో,
ప్రతిభలెచట నవనవముగ
ప్రగతిగాంచి వికసించునో,
స్వామీ! ఎట నీ భావన
సద్బుద్ధిని పూయించునో,
దేవా! ఎట నీ దీవెన
దివ్యకృతులు చేయించునో,
అచటికచటి కచ్చటికే
ఆ మహూదయమ్మునకే –
నా ప్రియతమ దేశమ్మును
నడిపించుము, జగదీశా !

# ప్రార్థన

చిత్తమెచట నిర్భయముగ
శిరమునెత్తి విహరించునో,
అడ్డులేక జ్ఞానమెచట
అన్ని దెసల ప్రసరించునో,
వసుధయెల్ల ఒక యిల్లను
భావమెచట వికసించునో,
ఎడదలోతు నుండి వచ్చు
నుడులెచ్చట వికసించునో,
నిరంతర శ్రమకెచ్చట
పరిపూర్ణత సిద్ధించునో,
ఎఱుక ముందు దురాచార
మెచ్చోటున తలవంచునో,
మదినెక్కడ నీ ప్రేరణ
మంచి తలపు పూయించునో,
మరినెక్కడ నీ దీవెన
మంచి పనులు చేయించునో,
అచ్చటికే, అచ్చటికే
ఆ స్వేచ్ఛా స్వర్గానికె
నా దేశము చేరుకొనగ
నడిపించుము నా తండ్రీ!

## నెమలి ఈడు-గేయ కవిత

ఏ కులదేవతల్ కనికరించిరొ! సిగ్గులు విచ్చు మొగ్గలై
ఏ కులపాలికల్ పలుకరించిరొ! తేనెలు చిందు తమ్మిపూ
రేకుల వంటి కైతల 'బలే' అనిపించెను సాహితీ సప
త్నీకుల మా 'ధనేకుల' అనేకుల, భావుకచంచరీకులన్!
-కరుణశ్రీ

కరుణశ్రీ, స్ఫూర్తిశ్రీ
లిరువురు నా గురువులన్న స్పృహయే చాలున్;
సరసమనోహర కవితా
పరిమళ భావమ్ములెన్నొ పర్విడు హృదిలోన్! -ధనేకుల



ఓయి! కల్కి తురాయివాడా!
సిరులు తొణికెడు కనులవాడా!
పట్టు పుట్టపువన్నెకాడా!
ఆడుమోయి నెమలి ఈడా!

కవితవ్రాయగ, బొమ్మగీయగ,
పాటపాడగ, నాట్యమాడగ
ప్రేరణమ్మొనరించువాడా!
ఆడుమోయీ నెమలిఈడా!

నెమలి ఆటయు, పికముపాటయు,
చిలుకమాటయు, మరపురావను
పలుకుపరువును నిలుపు ప్రోడా!
ఆడుమోయీ నెమలిఈడా!

తరతరమ్ముల చరితగల్గిన
భారతావని గారవించెడు
వినుతసుందర విహగరాజా!
ఆడుమోయీ నెమలిఱేడా!

లోకనాథుని ఓలగమ్మున
సహజనర్తకపదవి నొందిన
సత్కలా ఖగజగచ్ఛ్చాడా!
ఆడుమోయీ నెమలిఱేడా!

హృదయవేదిక నధివసించిన
విశ్వనాటకసూత్రధారుని
సూక్ష్మ సూచనలా చరించుచు
ఆడుమోయీ నెమలి ఱేడా!

తాను చేసిన జీవశిల్పము
తనకె అద్భుతమాయెనంచును
దేవదేవుడె తనివినొందగ
ఆడుమోయీ నెమలిఱేడా!

అసురసేనల ఉసురు దీసిన
ఆరుమోముల కొమరుసామికి
కూర్మి వాహనమైనవాడా!
ఆడుమోయీ నెమలిఱేడా!

కన్నెవలపుల వెన్న గైకొను
చిన్నకన్నయ శిరముపైగల
వన్నియల నగ నిడినవాడా!
ఆడుమోయీ నెమలిఱేడా !

అలుకబూనిన అనుగునెచ్చెలి
చెలిమికానిని చేరుతీరున
వలపు తలపులు పల్లవింపగ
ఆడుమోయీ నెమలిఱేడా!

కష్టజీవులు, భాగ్యహీనులు
వెతల బరువును విస్మరింపగ -
కనులవిందుగ వేడ్కనొందగ -
ఆడుమోయీ నెమలిఱేడా!

పడగ విప్పుచు, బుసలు గొట్టెడు
కుటిలసర్పపు జటిలదర్పము
రాలిపోవగ, కూలిపోవగ
ఆడుమోయీ నెమలిఱేడా!

కారుమబ్బులు క్రమ్మినంతనె
వానసామికి స్వాగతమ్మొగ
షడ్జరాగము నాలపించుచు
ఆడుమోయీ నెమలి ఱేడా!

పటు నట త్తటిదార్భటావలి,
ఘన ఘనాఘన దీర్ఘ కాహళి,
వ్యోమసీమల తీవరింపగ
ఆడుమోయీ నెమలిఱేడా!

పుట్టుచావుల నడుమనుండిన
వెలుగునీడల బ్రతుకుగాథను
స్మృతికి దెచ్చెడు పురిని విచ్చుచు
ఆడుమోయీ నెమలిఱేడా!

అల్లనల్లన పురిని విచ్చుచు,
కులుకునిక్కుల శిరమునెత్తుచు,
అదుపుదప్పక కదను ద్రొక్కుచు,
ఆడుమోయీ నెమలి ఱేడా!

ఆగిపోవుచు, ఊగిపోవుచు,
ఉత్సవమ్మున సాగిపోయెడు
రంగురంగుల ప్రభను బోలుచు
ఆడుమోయీ నెమలిఱేడా!

కడలితరగల ఆటుపోటులు,
కరి తురంగపు నీటుగోటులు,
నృత్యరీతుల నిన్ను జేరగ
ఆడుమోయీ నెమలిఱేడా!

పైరగాలికి పంటచేలును,
ఓరుగాలికి భూరుహాలును -
ఒఱగుతీరున తిరుగుతీరున
ఆడుమోయీ నెమలిఱేడా !

నీ హృదంతర చేతనత్వము,
నీ కలాప విలాసలాసము -
ఉఱవడింపగ, తుఱగలింపగ
అడుమోయీ నెమలిఱేడా!

భావవేగము, తీవ్రమోదము -
అపజాలక, ఓపజాలక
తన్మయత్వపు తాండవమ్మున
ఆడుమోయీ నెమలి ఱేడా!

మనమునందలి భావచేతన –
తనువునందున, వనమునందున,
భువనమందున ప్రతిఫలింపగ
ఆడుమోయీ నెమలిఱేడా!

గగనలోకపు వెలుగువన్నెలు,
భువనరాజ్యపు జిలుగుచిన్నెలు,
పింఛమందున పరిఢవిల్లగ
ఆడుమోయీ నెమలిఱేడా!

నీలమణులను, పచ్చరాలను
రాశివేసిన రమ్యసంపద
పింఛమందున తేజరిలగ
ఆడుమోయీ నెమలిఱేడా!

వర్షఋతువున నవవసంతము
తారసిల్లిన మధురభ్రాంతులు
పింఛమందున సంచలింపగ
ఆడుమోయీ నెమలిఱేడా!

చిత్రకంబళి వోలె పింఛము,
జై త్రచిహ్నము వోలె పింఛము,
వింతకాంతులు వెలువరింపగ
ఆడుమోయీ నెమలిఱేడా!

పూలగుమ్మటమట్లు పింఛము
మేలిచెక్కడమట్లు పింఛము,
వేలసౌరులు వెల్లడింపగ
ఆడుమోయీ నెమలిఱేడా!

కావ్యవర్ణన రీతి పింఛము,
దివ్యభావన రీతి పింఛము,
విశ్వమంతట విస్తరింపగ
ఆడుమోయీ నెమలిఱేడా!

ఇటునటు నటునిటు గన నొ
క్కటిగానే కానిపించు 'కవిజీవిక' ఇ
ట్టటులై 'నవజీవన' పద
మటులై 'మందారదామ' మటు కడుమృదువై!

-కరుణశ్రీ

ఏ కులదేవతల్ కనికరించిరొ! సిగ్గులు విచ్చు మొగ్గలై
ఏ కులపాలికల్ పలుకరించిరొ! తేనెలు చిందు తమ్మిపూ
రేకుల వంటి కైతల 'బలే' అనిపించెను సాహితీ సప
త్నీకుల మా 'ధనేకుల' అనేకుల, భావుకచంచరీకులన్!

-కరుణశ్రీ

వేకువ వెలుగును చీకటి
లోకమునకు జూపగల సులోచనశతముల్
మీ కవితలు రసగుళికలు;
నాకవి నచ్చినవి చాల నవకవితిలకా!

-పి. బి. శ్రీనివాస్

నీ కీర్తిపతాకగ, నీ
యీా 'కవిజీవిక' నలంకరించిన 'సీతా
కోకచిలుక' విశ్వకవన
నాక వనమున విహరించు నవ్యకవీంద్రా!

-సుఖవాసి మల్లికార్జునరావు

త్రిస్రగతిలో గుంటూరు పట్టణం కోణాలన్నిటినీ అందంగా స్పృశించి చూపారు. గుంటూరును గుండెలో నిలుపుకునేట్టు చేసిన మీ కవనధారకు నా అభినందన.

- సి. నారాయణరెడ్డి

మీ చేతిలో - కాదు, వాక్కులో హయప్రచార రగడ కదను త్రొక్కింది. గుంటూరుకు సంబంధించి అన్ని పార్శ్వాలనూ, అన్ని అంశాలనూ, నిర్భయంగా, నిర్మొహమాటంగా, నిర్మమంగా చిత్రించడం ఎంతో హృద్యంగా వుంది.

- కోవెల సంపత్కుమారాచార్య

నాణెమైన పలుకులతో,
నవ్యమైన తలపులతో
నీవల్లిన "గుంటూరు" ను
నే మెచ్చితి ధనేకులా !

- స్ఫూర్తిశ్రీ టి. భాస్కరరావు

ఏమయ్యా ! మాత్రాఛందస్సుల మహారాట్టూ! నీ గేయాలు చదివాను. చాలా.... బాగా వ్రాశావయ్యా ! అగ్రశ్రేణి గేయకవుల్లో నీవున్నావు !

- నాగభైరవ కోటేశ్వరరావు

ఏవైనా మార్పులు, చేర్పులు ఉంటే సూచించమంటున్నారా? మా బోంట్ల సూచనలన్నిటికీ అతీతంగానే ఉంది మీ కవనరచన. ఈ కల్యాణవేళ మిమ్మల్ని చూడడం నాకెంతో ఆనందంగా ఉంది.

- ఎస్.వి. భుజంగరాయశర్మ

ఇటునటు నటునిటు గన నా క్కటిగానే కానిపించు 'కవిజీవిక' ఇ
ట్టటులై 'నవజీవన' పద మటులై 'మందారదామ' మటు కదుమృదువై!

ఏ కులదేవతల్ కనికరించిరొ! సిగ్గులు విచ్చు మొగ్గలై
ఏ కులపాలికల్ పలుకరించిరొ! తేనెలు చిందు తమ్మిపూ
రేకుల వంటి కైతల 'బలే' అనిపించెను సాహితీ సప
త్నీకుల మా 'ధనేకుల' అనేకుల, భావుకచంచరీకులన్! - కరుణశ్రీ

వేకువ వెలుగును చీకటి లోకమునకు జూపగల సులోచనశతముల్
మీ కవితలు రసగుళికలు; నాకవి నచ్చినవి చాల నవకవితిలకా! - పి. బి. శ్రీనివాస్

నీ కీర్తిపతాకగ, నీ యీ 'కవిజీవిక' నలంకరించిన 'సీతా
కోకచిలుక' విశ్వకవన నాక వనమున విహరించు నవ్యకవీంద్రా!

- సుఖవాసి మల్లికార్జునరావు

త్రిస్రగతిలో గుంటూరు పట్టణం కోణాలన్నిటినీ అందంగా స్పృశించి చూపారు. గుంటూరును గుండెలో నిలుపుకునేట్టు చేసిన మీ కవనధారకు నా అభినందన.

- సి. నారాయణరెడ్డి

మీ చేతిలో - కాదు, వాక్కులో హయప్రచార రగడ కదను ద్రొక్కింది. గుంటూరుకు సంబంధించి అన్ని పార్శ్వాలనూ, అన్ని అంశాలనూ, నిర్భయంగా, నిర్మొహమాటంగా, నిర్మమంగా చిత్రించడం ఎంతో హృద్యంగా వుంది. - కోవెల సంపత్కుమారాచార్య

నాణెమైన పలుకులతో, నవ్యమైన తలపులతో
నీవల్లిన "గుంటూరు" ను నే మెచ్చితి ధనేకులా ! - స్ఫూర్తిశ్రీ టి. భాస్కరరావు

ఏమయ్యా ! మాత్రాఛందస్సుల మహారాట్టూ! నీ గేయాలు చదివాను. చాలా
బాగా వ్రాశావయ్యా ! అగ్రశ్రేణి గేయకవుల్లో నీవున్నావు ! - నాగభైరవ కోటేశ్వరరావు

ఏవైనా మార్పులు, చేర్పులు ఉంటే సూచించమంటున్నారా? మా బోంట్ల సూచనలన్నిటికీ అతీతంగానే ఉంది మీ కవనరచన. ఈ కల్యాణవేళ మిమ్మల్ని చూడడం నాకెంతో ఆనందంగా ఉంది. - ఎస్.వి. భుజంగరాయశర్మ